# చందమామ




సంపుటి 102 మే 2000 సంచిక 5

## ఈ సంచికలో...

### కథలు



### జానపద సీరియల్



### పౌరాణిక సీరియల్



### చారిత్రక విశేషాలు



### శీర్షికలు



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

## ఈ నెల విశేషాలు



వింత పానీయం (బేతాళ కథ)



జడబుద్ధి



స్వర్ణ సింహాసనం

మీకు తెలుసా?

చందమామ






దూర తీరాల్లో వున్న

మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి!



# చందమామ

వారి భాషలో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతి, హిందీ, కన్నడ, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్ళకి
చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు

పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా

పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారాగాని చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది చిరునామాకు పంపండి.

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI-600 026


సంపాదకుడు
విశ్వం

ప్రధాన కార్యాలయం
చందమామ బిల్డింగ్స్
వడపళని, చెన్నయ్-600 026
ఫోన్: 4841778, ఫ్యాక్స్: 4835298

ఇతర కార్యాలయాలు

భువనేశ్వర్
116-బి, బి.డి.ఎ, డ్యూప్లెక్స్ హౌస్,
బారముండ, భువనేశ్వర్-751 003
ఒరిస్సా. ఫోన్:455 0534

ఢిల్లీ
ఫ్లాట్ నం. 415, 4 ఫ్లోర్
ప్రతాప్ భవన్
5, బహదుర్‌షా జఫర్ మార్గ్
ఢిల్లీ-110 002 ఫోన్:3353406/7

ముంబాయి
2/B నాజ్ బిల్డింగ్స్,
లామింగ్‌టన్ రోడ్,
ముంబాయి-400 004
ఫోన్:3889763-3886324-3877110
ఫ్యాక్స్:3889670

అమెరికాలో
విడి కాపీ
$2
సంవత్సర చందా
$20



సంచాలకులు:
చక్రపాణి, బి. నాగిరెడ్డి

# నూతన తీరాల కేసి...

భారత దేశంలోని బాలబాలికలందరికీ గతంలోని మంచిని తెలియచేయాలి. దానిద్వారా ఉజ్వల భవిష్యత్తును గురించి పిల్లలందరినీ సమిష్టిగా ఆలోచింప చేయాలి అన్నది చందమామ ఆశయం. గతాన్ని బాగా అర్థం చేసుకుని, భవిష్యత్తు పట్ల విశ్వాసంతో ఆలోచించినట్టయితే, వర్తమానంలో ఎలా జాగ్రత్త పడాలో తేటతెల్లమవుతుంది!

ఈ లక్ష్య సాధనలో దాదాపు అర్ధశతాబ్దానికి పైగా చందమామ కొంత వరకు విజయం సాధించింది. సంస్కృతం, ఇంగ్లీషు భాషలతో సహా పన్నెండు భారతీయ భాషలలో వెలువడుతూ లక్షలాది బాలబాలికలకు ప్రియతమ నేస్తం అయింది. ఈనాడు మరొక నూతన అధ్యాయంలో అడుగు పెడుతోంది. బొంబాయి నుంచి వెలువడే సుప్రసిద్ధ, ప్రతిష్ఠాత్మక ప్రచురణ మిడ్-డే పత్రికద్వారా మరెందరో యువపాఠకులను అలరించనున్నది. ప్రతి శనివారం మిడ్-డే తో 'ఫన్ డే విత్ చందమామ' అనే ఎనిమిది పేజీల అనుబంధం వెలువడుతోంది.

అంతేకాదు; ఇప్పుడు మన పత్రిక ఇంటర్నెట్ రంగంలోనూ ప్రవేశించింది. తొలి దశలోనే అసంఖ్యాకులైన అభిమానుల అభినందనలను అందుకుంటున్నది!

పిల్లలను విద్యావంతులను చేయడానికి చందమామ కృషి చేస్తోంది. అయితే అది మామూలు పాఠాలు, పరీక్షల ద్వారా కాదు; ఉదాహరణల ద్వారా. మితిమించిన శ్రమతో కాదు; సరదాగా, ఆనందంగా. నిస్సారమైన చరిత్ర పాఠాల ద్వారా కాకుండా కమ్మని కథల ద్వారా ప్రాచీన సంస్కృతీ విశేషాలను విశదపరచడానికి కృషిచేస్తోంది. ఈ నూతన దిశలో పయనిస్తూ మరిన్ని నూతన శిఖరాలను అందుకుంటూ-తన అనుభవాలను పెరుగుతూన్న పాఠకలోకంతోనూ, విస్తృతమవుతూన్న ప్రేక్షక ప్రపంచంతోనూ పంచుకోవడానికి శాయశక్తులా కృషి చేస్తోంది!

# చందమామ కబుర్లు

## కరుగుతూన్న హిమాలయాలు!

మనిషి నెలకొల్పుతూన్న పరిశ్రమలు, నడుపుతూన్న వాహనాలు కారణంగా వాతావరణంలోకి మితిమించిన బొగ్గుపులుసు వాయువు, గ్రీన్ హౌస్ గ్యాస్ విడుదల అవుతున్నవి. వీటి కారణంగా అంతరిక్షంలో వేడి ఎక్కువవుతున్నది. దాంతో హిమాలయ



పర్వతాలలోని బ్రహ్మాండమైన మంచు బండలు కరగడం ప్రారంభించాయి. 1999వ సం॥లో సింధునది నీటిమట్టం లోగడకన్నా బాగా పెరిగింది. వాతావరణానికి హానికలిగిస్తూన్న మనిషి కృత్యాలను అరికట్టడానికి తగిన చర్యలు తీసుకోనట్టయితే, హిమాలయాల పాదతలంలోని సువిశాల ప్రాంతాలు వెల్లువలో కొట్టుకుపోయే అపాయం వుందని 'వరల్డ్ వాచ్ సంస్థ' హెచ్చరిస్తున్నది!

## హైజాకర్లకు దుర్వార్త!

మాదక ద్రవ్యాలనుంచి ప్రేలుడు పదార్థాల వరకు దేనినైనా సరే ప్రయాణీకులు తమ దుస్తులలో ఎంత జాగ్రత్తగా దాచుకున్నా ఇట్టే బయటపెట్టగల సరికొత్త స్కానింగ్ మెషీన్ రూపొందించబడింది. అంటే మామూలు మెటల్ డిటెక్టర్లు కనుగొనలేని వాటిని కూడా




ఇవి బయటపెడతాయన్న మాట. విమానాల్లో హైజాకర్ల బెడదను నిర్మూలించడానికి ఈ నూతన యంత్రాన్ని ఉపయోగించనున్నారు.

## చెవిటివారికి శుభవార్త!




పుట్టుకతో వినికిడి శక్తిలేని పిల్లలకు, మునుముందు వినేశక్తిని పెంపొందించుకునే అవకాశం ఉన్నది. బ్రిటిష్ శాస్త్రవేత్తలు శిశువుల చెవుల్లో అమర్చడానికి వీలుగా వుండే అతి చిన్న చెవులను రూపొందించారు. అవి బయటకు కనిపించవు. చెవులను రుద్దుకోవడం ద్వారా 'రీచార్జ్' అయ్యే 'పీ బ్యాటరీ'తో అవి పనిచేస్తాయి. అవి మామూలు 'హియరింగ్ ఎయిడ్' కన్నా భిన్నమైనవి.

# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

## రవీంద్రనాథ టాగూర్

విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ 1861వ సంవత్సరం మే 7వ తేదీ కలకత్తా నగరంలో జన్మించారు. ఆయన తండ్రి దేవేంద్రనాథటాగూర్ దాతృత్వంగల సంపన్న కుటుంబీకుడు.

అతి పిన్నవయసులోనే రవీంద్రనాథటాగూర్ కవితలల్లడం, రచనలు చేయడం ప్రారంభించాడు. ఇరవైయేళ్ళు వచ్చేసరికే ఆయన ప్రతిభ, సుప్రసిద్ధనవలాకారుడూ; మనజాతీయ ప్రార్థనా గీతం 'వందేమాతరం' గీత రచయితా అయిన బంకించంద్ర చటర్జీ దృష్టిని ఆకర్షించింది!

రవీంద్రులు కవిగా విశ్వవిఖ్యాతిని గడించినప్పటికీ ఆయన ఉత్తమ శ్రేణి నవలా రచయిత, కథా రచయిత, వ్యాస రచయిత కూడా. ఆయన కవితా సంకలనం 'గీతాంజలి'కి 1913వ సంవత్సరం నోబెల్ సాహిత్య బహుమతి లభించింది. మొదట మాతృభాష అయిన బెంగాలీలో రచించిన కవితలను ఆయనే ఆంగ్లంలోకి అనువదించారు. రవీంద్రనాథటాగూర్ నిజాయితీ పరుడైన దేశభక్తుడు. భారత జాతీయ ప్రవక్త శ్రీ అరవిందులను బ్రిటిష్ పాలకులు పీడించినప్పుడు "అరవిందో! నీకిదే రవీంద్రుడి ప్రణామం!" అనే స్ఫూర్తిదాయకమైన కవితను రచించారు.



ఆయనలోని దేశభక్తి - శాంతినికేతన్‌లో 'విశ్వభారతి' విశ్వవిద్యాలయ స్థాపనకు ఆయన్ను పురికొల్పింది. అక్కడి విద్యాబోధనలో జాతీయ భావాలకూ, జాతీయ సంస్కృతికీ ప్రథమ స్థానం ఇవ్వబడేది. రవీంద్రనాథటాగూర్ సమకాలీన బెంగాలీ సాహిత్యాన్ని అందరికన్నా అమితంగా ప్రభావితం చేశారు. భారతీయ సాహిత్యం మీదా, సంస్కృతి మీదా కూడా ఆయన రచనల ప్రభావం ఎంతగానో ఉన్నది. 1941 ఆగస్ట్ 7వ తేదీ ఆయన కీర్తిశేషులయ్యారు.

'సృజనాత్మక ఐక్యత' అనే తన గ్రంథంలో రవీంద్రనాథటాగూర్ ఇలా అన్నారు: మన కార్యకలాపాల్లో అత్యధిక భాగం ఆకారాలను సృజించడంలోనే నిమగ్నమై ఉన్నాయి. అవి ఉపయోగకరమైన పనులకు గాని, హేతుబద్ధమైన భావాలను రూపొందించడానికి గానీ నిర్దేశించినవి కావు. అవి పరమసత్యం పుట్టించే స్పందనలకు ప్రతిస్పందనలుగానే ఉంటున్నాయి. ఇలా ఆకారాలను సృజించడం ద్వారా శిశువు ప్రపంచానికి అనుగుణంగా తన సొంత ప్రపంచాన్ని సృష్టించుకుంటున్నది. మనలోని శిశువు, తెరమరుగు నుంచి తనతో దాగుడుమూతలాడే శాశ్వతమైన చెలికాణ్ణి-సముద్రం నుంచి లేచే పోర్షియస్‌గా, వంపులు తిరిగిన కొమ్ము ఊదే ట్రైటన్‌గా మెరుపుల్లా దర్శిస్తుంది. అలా కలిసి ఆటలాడే చెలికాడే పరమసత్యం. సమాచారం అందించకపోయినా, సహాయకారిగా లేకపోయినా కేవలం భావ వ్యక్తీకరణలోనే ఆ పరమసత్యం శిశువుకు ఆనందం కలిగిస్తుంది. అనంతంలోనే ఆకారాలను సృష్టించే ఆనందం ఉన్నది; అదే మనలోని ఊహానందాన్ని ప్రేరేపిస్తుంది!

# చందమామ

## ఏప్రిల్ 2000




### సమాధానాలు

1. హరిశ్చంద్రుడు. చంద్రమతి. కాశిలో.
2. ఎ. శ్రీకృష్ణుడు విదర్భ రాజకుమారి రుక్మిణిని వివాహమాడాడు.

   బి. బలభద్రుడు కుశస్థలి యువరాణి రేవతిని వివాహమాడాడు.

   సి. నలుడు నిషిధ దేశాధిపతి.

   డి. మార్కండేయముని పుష్పభద్ర తీర్థం వద్ద తపస్సు చేశాడు.

   ఇ. గుహుడు శృంగిబేరపుర రాజు.
3. 1. ఇళంగో అడిగళ్ రచించిన శిలప్పదిగారం.

   2. బృహత్కథ గ్రంథకర్త గుణాఢ్యుడు.

   3. మహాభారతం (అరణ్య పర్వం).

   4. కంబన్-తులసీదాసు.

   5. చార్వాకుడు.

# సృజనాత్మక పోటీలు



## చందమామ
## పాఠకులకు ఆహ్వానం

మీ ఊహాశక్తికీ, వివిధ రంగాలలో మీ సృజనాత్మక ప్రతిభకూ పదునుపెట్టే పోటీలలో పాల్గొనండి!





## ఫోటో
### వ్యాఖ్యల పోటీ

1. ఫోటో వ్యాఖ్యల పోటీ పేజీకి కావలసిన రెండు ఫోటోలను యువఫోటోగ్రాఫర్లు పంపవచ్చు. రెండు ఫోటోలకూ పరస్పర సంబంధం ఉండాలి. ఆ సంబంధం గురించిన సొంత వివరణ రాసి, తప్పకుండా ఆ ఫోటోలతో జతచేసి పంపాలి.

ఎంపికచేయబడే (రెండు) ఫోటోలకు
బహుమతి రూ.500/-

ఫోటోలు ఎప్పుడైనా పంపవచ్చు.



2. మీ పత్రికలో ఒక సామెతను ప్రచురిస్తాం. ఆ సామెతలోని విషయాన్ని వివరించే సంఘటనను గాని, సొంత అనుభవాన్నిగాని, లేదా (కొత్త/పాత) కథనుగాని 300 పదాలకు మించకుండా రాసి పంపాలి. మీరు పంపే రచనలో సామెతలకు సంబంధించిన విషయం ఉండాలే తప్ప, ఆ సామెత పుట్టిన కారణం తెలియజేసే అసలు కథను మాత్రం పంపకూడదు అన్న విషయం గుర్తుంచుకోండి.

**ఈ నెల సామెత: "అరువు సొమ్ము బరువు చేటు"**

**ఎంపికచేయబడే రచనకు బహుమతి రూ. 500/-**

మీ రచనలు మే 31లోగా మాకు చేరాలి. గెలుపొందిన రచన ఆగస్ట్ నెల సంచికలో ప్రచురించబడుతుంది.

మీ ఎంట్రీలను ఈ చిరునామాకు పంపండి:
**చందమామ సృజనాత్మక పోటీలు**
చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026

—సంపాదకుడు



బేతాళ కథలు

# వింతపానీయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కన్ను పొడుచుకున్నా కానరాని ఈ అర్ధరాత్రివేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో, నువ్వు పడుతున్న ఇక్కట్లు చూస్తూంటే, ఒక్కొక్కసారి నీమీదజాలికి బదులు, కోపం కలుగుతూంటుంది. ప్రతి ఒక్కరాజూ, శత్రురాజుల పన్నాగాలూ; దేశ ప్రజల్లోవున్న రాజద్రోహుల గురించీ ఎప్పటికప్పుడు తెలుసుకునేందుకు గూఢచారులను, ఎంతో వ్యయప్రయాసల కోర్చి పోషిస్తూంటారు. ఇలాంటి



దేమీ లేకుండా, వాళ్ళవాళ్ళ నిజస్వరూపా లను తెలుసుకునేందుకు, అతి సులభ మైన మార్గంవుండీ కూడా, దాన్ని కాదన్న మయూరాక్షుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చాలా కాలం క్రితం, కాంభోజదేశాన్ని పాలించిన మయూరాక్షుడికి, వింతవస్తువు లంటే ఎంతోమక్కువ. అలాంటివి తెచ్చిన వాళ్ళను బంగారుకాసులతో ఘనంగా సన్మానించేవాడు. అందుచేత, దేశదేశాల నుంచిఎందరో వింతవస్తువులతో, రాజును చూడవచ్చేవారు.

ఒకసారి, మయూరాక్షుడు కొలువు తీరివుండగా, ఒక అపరిచితుడు వచ్చి రాజుకు వంగి నమస్కరించి, "మహారాజా, నేను భూతాలకు గురువైన కలహకేతుడికి ప్రియశిష్యుణ్ణి. ఎంతోకాలం ఆయనకు సేవలు చేసి, ఆయన వల్ల, ఒక వింత పానీయం తయారుచేసే విధానం తెలుసు కున్నాను. నా పేరు గరళభోగి," అన్నాడు.

వాడి చేతిలో కూజాలాంటి ఒక అంద మైన పాత్ర వున్నది. వాడికళ్ళు జీవంలేని శవంకళ్ళలావున్నాయి. తల బోడిగా వుండి, పిల్లిగడ్డం మాత్రం వున్నది.

మయూరాక్షుడు, వాడి వింత ఆకారం కేసి ఆశ్చర్యంగాచూస్తూ, "ఆ పాత్రలో వున్నదే, నువ్వుచెప్పేవింతపానీయంఅనుకుంటాను. ఏమిటి దాని వింత?" అని అడిగాడు.

"మహారాజా, ప్రతిమనిషిలోనూ, మనకు కనిపించని ఇంకొకమనిషి వుంటాడు. వాడే అసలుసిసలైన వాడు. ఈ పానీయం సేవిస్తే, ఆ మనిషిలోని మనిషిని, మనం చూడ గలం!"అన్నాడు వినయంగా పిల్లిగడ్డంవాడు.

"మనిషిలో మనిషి వుండడం ఏమిటి? నీ మాటలు నాకు సరిగా బోధపడడం లేదు," అన్నాడు మయూరాక్షుడు.

"మహారాజా! మీ మీద ఎంతో భక్తి విశ్వాసాలు నటిస్తూ, మీరంటే గిట్టనివాళ్ళు ఎందరో వుంటారు. ఈ పానీయం తాగిస్తే, వాళ్ళ నిజరూపం బయటపడుతుంది. అదుగో, ఆ నిలబడివున్న కాపలాభటుడికి, ఈ పానీయం ఇచ్చి చూడండి,"అన్నాడు పిల్లిగడ్డంవాడు.

రాజువెంటనే కాపలాభటుణ్ణి పిలిచి, వాడిచేత ఆ వింతపానీయం తాగించాడు. ఒక క్షణకాలం గడిచే సరికి, ఆ భటుడు

పూనకం వచ్చిన వాడిలా ఊగిపోతూ, రాజుకు కొంచెం దూరంలో కూర్చునివున్న భవనరక్షకుడు వీరపాలుడికేసి కళ్ళెర్ర చేసిచూస్తూ, "ఒరే, వీరపాలూ! నలుగు రిలో, నా చెంపమీదకొట్టి, నా అంతవాణ్ణే అవమానిస్తావా?" అంటూ, చేతిలోవున్న ఈటెను వీరపాలుడి మీదికి విసిరాడు.

అయితే, వీరపాలుడు, ఒక్క ఉదుటున ఆసనంలోనుంచి పక్కకు గెంతి ప్రాణా పాయంనుంచి బయటపడ్డాడు. జరిగిన దానికి సభలో కలకలంచెలరేగింది. రాజు ఖిన్నుడై, సంగతేమిటని వీరపాలుణ్ణి విచా రిస్తే, ఒకసారి ఆ కాపలాభటుడు విధినిర్వ హణలో పొరబాటు చేసినందుకు, వాడి చెంపమీద కొట్టిన మాట నిజమేనని ఒప్పు కున్నాడు. ఎప్పుడోజరిగిన చిన్న సంఘట నను మనసులో పెట్టుకుని, భటుడు ఇంత కాలం వినయం నటిస్తున్నాడన్నమాట!

రాజు, ఆ భటుణ్ణి బంధించమని ఆజ్ఞా పించి, "ఎన్నో వింతలు చూశాను. ఈ పానీయం అద్భుతం, అమోఘం!" అని, పిల్లిగడ్డంవాడికి విడిది ఏర్పాటు చేశాడు.

ఆ రాత్రి, వీరపాలుడు, రాజును ఏకాం తంగా కలుసుకుని, "మహారాజా, ఆ పిల్లిగడ్డంవాడూ, కాపలాభటుడూ కలిసి నాటకం ఆడారని, నాకు అనుమానంగా వున్నది. ఆ వింతపానీయం నాకు కొంచెం యిప్పిస్తే, స్వయంగా పరిశీలించి మీకు చెపుతాను," అన్నాడు.

రాజుకు ఈ ఆలోచన నచ్చింది. ఆయన పిల్లిగడ్డం వాడి దగ్గర నుంచి, ఒక



చిన్న పాత్రలో వింతపానీయం తెప్పించి, వీరపాలుడికిచ్చాడు. ఆ పాత్ర తీసుకుని వీరపాలుడు తిన్నగా శివాలయం దగ్గరకు వెళ్ళాడు. ఆలయం ముందున్న అరుగు మీద ఒక భక్తుడు ధ్యానం చేసుకుంటు న్నాడు. జపజీవాలుడిగి, ఎప్పుడూ దైవచిం తనలో గడిపే అతడికి, వింతపానీయం యిస్తే, ఖచ్చితంగా నిజానిజాలు తెలుస్తా యని, వీరపాలుడి ఆలోచన!

అతడు, భక్తుణ్ణి సమీపించి, "స్వామీ, నేను కాశీయాత్ర చేసి వస్తున్నాను. ఇది అక్కడినుంచి తెచ్చిన పవిత్రజలం. కొంచెం సేవించండి!" అని, వింతపానీయంవున్న పాత్రను అతడికి అందించాడు.

భక్తుడు పాత్రను అందుకుని, "బిడ్డా, నీకు పరమశివుడు మేలుచేస్తాడు!" అని,



నవ్వసాగాడు. అప్పుడు రాణి, ఆయనకేసి ఆశ్చర్యంగా చూస్తూ, "తమ నవ్వుకు కారణం ఏమిటో అడగవచ్చా!" అన్నది.

"మరేంలేదు. మన వీరపాలుడు, ఆ వింత పానీయాన్ని నమ్మక, శివాలయం దగ్గర ధ్యానం చేసుకుంటున్న, ఒక భక్తుడి చేత తాగించి ఒళ్ళు హూనంచేయించు కున్నాడు. అది గుర్తుకు వచ్చి నవ్వాగడం లేదు," అన్నాడు రాజు.

"ఆ పానీయం అంత గొప్పదా?" అని అడిగింది రాణి.

"ఆ పానీయం గొప్పదనాన్ని గ్రహించాను గనకే, దానిమీద పదిలక్షలబంగారు కాసులు ఖర్చుచేయదలచాను!" అన్నాడు మయూరాక్షుడు.

"మహారాజా! నేను విన్నదాన్ని బట్టి, ఆపానీయం మీద సదుద్దేశంలేదు. కొంత పానీయంయిప్పించారంటే, నేను ప్రయత్నించి, నా అభిప్రాయం చెబుతాను," అన్నది రాణి.

ఆ మాటలకు రాజు పెద్దగా నవ్వి, "మహారాణీ! నీకూ వీరపాలుడి జాడ్యమే పట్టినట్టున్నది. సరే, ఆ పానీయం యిప్పిస్తాను. వీరపాలుడిలాగా మంచానపడతావేమో, జాగర్త!" అన్నాడు.

తర్వాత, రాణి తన మందిరం చేరుకుని, రాజు పంపిన వింతపానీయాన్ని, తన ప్రధాన చెలికత్తె సుభాషిణి చేత తాగించింది. తాగిన కొంతసేపటికి సుభాషిణి కోపంతో ఊగిపోతూ చరచరా వంటశాలకు వెళ్ళి, వంటవాడితో, "ఇదిగో, ఇది

వింతపానీయాన్ని గుటగుటా తాగేశాడు. తర్వాత, నాలుగైదు నిమిషాలు గడిచినై. ఉన్నట్టుండి భక్తుడు పూనకం వచ్చినవాడిలా ఊగిపోతూ, వీరపాలుణ్ణి ఆపాద మస్తకం పరిశీలనగాచూసి, "శరభ శరభా!" అంటూ, తన చేతికర్రతో, వీరపాలుణ్ణి స్పృహకోల్పోయేలాగా కొట్టాడు.

ఆ తర్వాత, భక్తుడు, వీరపాలుడి చేతి వేళ్ళకున్న బంగారు ఉంగరాలూ, మెడలోని హారం గుంజుకుని పరిగెత్తసాగాడు. అయితే,ఆ సమయంలో గస్తీతిరుగుతున్న భటులు, అతణ్ణి పట్టుకునికొట్టి, కారాగృహానికి పంపి, వీరపాలుణ్ణి ఇంటికి చేర్చారు.

ఆ మర్నాడు, రాజు విశ్రాంతి మందిరంలో రాణితో మాట్లాడుతూ, వీరపాలుడు దెబ్బలు తినడం గుర్తుకు వచ్చి పెద్దగా

నా ఆజ్ఞ, తెలిసిందా? నిన్న మహారాణి తను చెప్పిన పారిజాతాలతోకాక, మల్లెలతో తనపాన్పును అలంకరించానని రుసరుస లాడింది. పారిజాతాలు దొరకనప్పుడు ఏంచేయాలి? ఆమె కోపాన్ని నేను భరించ లేను. ఆమెకు పంపే భోజనంలో విషం కలుపు!" అని, ఆజ్ఞాపించింది.

ఈ సంగతి వంటవాడి ద్వారా విన్న మహారాణికి ఎక్కడలేని ఆశ్చర్యంకలిగింది. ఆ రాత్రి మయూరాక్షుడు అంతఃపురానికి వస్తూనే, "ఏమైంది, మహారాణీ! వింత పానీయం మీద నీ అనుమానం తీరిందా? దాని మహిమ అద్భుతమని ఒప్పుకుం టావా? ఆ పానీయం పుణ్యమా అని ఇద్దరు దుర్మార్గులు బయటపడ్డారు. అందుకే, ఎంత ఖర్చయినా వెనుకాడక మన ఉద్యోగులకూ, నగర ప్రజలకూ సరి పడా వింతపానీయం తయారు చేయించి, మనుషుల్లోని మర్మం తెలుసుకోవాలను కుంటున్నాను. అప్పుడు, మంచివాళ్ళను వదిలి, చెడ్డవాళ్ళనుశిక్షించి, ప్రపంచదేశాల్లో, కాంభోజ నగరంలో మంచికితప్ప,చెడుకు చోటు లేదన్న కీర్తి గడించవచ్చు!" అన్నాడు గర్వంగా.

భర్త చెప్పినదంతా విన్న రాణి, ఆయ నకు తన చెలికత్తె సుభాషిణి, వంటవాడికి ఎలాంటి ఆజ్ఞలిచ్చిందో వివరించి, "మహా రాజా! ఒకనాడు మీరూ, నేనూ ఉద్యాన వనంలో విహరిస్తున్నప్పుడు, నేను ఒక మొగలిపొదలో మొగలి రేకొకటి తుంచబో తూంటే, మిన్నాగొకటి నన్ను కాటెయ్య




బోయింది. అప్పుడు, సుభాషిణి తన ప్రాణాన్ని లెక్కచెయ్యకుండా,ఆ పామును వడిసిపట్టుకుని దూరంగా విసిరికొట్టింది. ఇది స్వయంగా మీరు చూసిందేగదా! అలాంటి సుభాషిణి, నన్ను చంపే ప్రయత్నంచేయడమేమిటి?" అన్నది.

ఇది విన్న రాజు మయూరాక్షుడు కొంతసేపు దీర్ఘంగా ఆలోచిస్తూ, మౌనంగా వుండిపోయి, చప్పున ఆసనంమీద నుంచి లేచి, అంతఃపురముఖద్వారం కేసి వేగంగా వెళ్ళి, అక్కడ వున్న గంటను మోగించాడు. ఆ మరుక్షణం బిలబిలమంటూ వచ్చిన నలుగురు భటులను, 'వెంటనే, అతిథి గృహంలో వున్న పిల్లిగడ్డంవాణ్ణి బంధించి, కత్తుల బావిలోకి తొయ్యండి!" అని ఆజ్ఞా పించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మయూరాక్షుడు, పిల్లిగడ్డంవాణ్ణి కత్తుల బావిలో తోయమని భటులను ఆజ్ఞాపించడం, అనాలోచితం, అవివేకం అవుతుందిగదా! వాడు ఏ మంత్రతంత్రాలూ ప్రయోగించకుండానే, ప్రత్యక్షసాక్ష్యంగా, వింతపానీయం ఎంత శక్తివంతమైనదో రుజువుచేశాడు. పైగా వాడు ఏదారే పోయే బైరాగీకాదు. సాక్షాత్తూ, భూతాలకు గురువైన కలహకేతుడి ప్రియ శిష్యుడైన గరళభోగి. రాజు ఆ పానీయంద్వారా, తనపట్ల నిజమైన భక్తి శ్రద్ధలు కలవాళ్ళెవరో, ఎవరు భక్తి శ్రద్ధలు కలవాళ్ళుగానటిస్తూమోసగిస్తున్నారో తెలుసుకోవచ్చు. అంతేకాక, దేశంలో వున్న దుష్టులనూ, రాజద్రోహులనూ, పానీయం ద్వారా గుర్తించి, తగు విధంగా శిక్షించవచ్చు. రాజు, ఇలాంటి సదవకాశాన్ని చేజార్చుకోవడంలో మహారాణి ప్రమేయం కూడా వున్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజుకు స్వభావసిద్ధంగా వున్న వింతవస్తువులపట్ల మితిమీరిన మక్కువే, ఆయనను వింతపానీయం విషయంలో అపమార్గం పట్టించింది. అసలు మధుపానీయమే, మనిషి బుద్ధిని వక్రపరిచి, మంచి-చెడుల మధ్య గల తేడాను మరిచేలా చేస్తుంది. ఇక, పిల్లిగడ్డంవాడు, తానుభూతాలగురువుకు ప్రియ శిష్యుణ్ణని చెప్పినప్పుడు కూడా, వాడూ భూతమన్నవాస్తవాన్ని ఆయన గుర్తించలేకపోయాడు. మహారాణి, తన ప్రధాన చెలికత్తె సుభాషిణి వింతప్రవర్తన గురించి చెప్పిన తర్వాతే, రాజుకు, పిల్లిగడ్డం వాడి నిజరూపం అర్థమైంది. వాడు తెచ్చిన వింతపానీయంలో, ప్రతి మనిషిలోనూ నేర ప్రవృత్తిని ప్రేరేపించే దుష్టలక్షణం తప్ప, మంచి నుంచి చెడును వేరుచేసే గుణంలేదని, ఆయన గుర్తించాడు. అందువల్లనే, పిల్లిగడ్డంవాణ్ణికత్తులబావిలో తోయమని భటులను ఆజ్ఞాపించాడు. ఇది, ఎంతో వివేక మైన నిర్ణయం!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

*[ఆధారం: మల్లవరపు మనోహరరెడ్డిరచన]*



# ఉత్తరీయం

హేలాపురిలో, వ్యాపారసంబంధమైన లావాదేవీలు చూసుకురావడానికి, తన ఊరు నుంచి బయల్దేరాడు కనకయ్య. అతడు పట్టణంలో పని చూసుకుని, మధ్యాహ్నం కావడంతో, పూటకూళ్ళ ఇంటికి వెళ్ళాడు. అక్కడ అతడికి తన ఊరివాడే అయిన శంకరయ్య కనిపించాడు.

తిరుగుప్రయాణంలో, ఒకరికొకరు తోడుగా వుండొచ్చని, ఇద్దరూ చాలా సంతోషించారు. పక్కపక్కనే కూర్చుని కులాసాగా మాట్లాడుకుంటూ భోజనాలు ముగించారు. తర్వాత, ఇద్దరూ పూటకూళ్ళావిడకు డబ్బుయిచ్చి, బయటికి వచ్చారు.

ఇంతలో వెనుక నుంచి పూటకూళ్ళ ఇంటి పనివాడొకడు గబగబావచ్చి, "అయ్యా, తమ ఉత్తరీయం మరిచిపోయారు!" అంటూ, వెండిజరీ పొదగబడిన ఖరీదైన ఉత్తరీయం కనకయ్య చేతికి అందించాడు.

కనకయ్య, ఆ ఉత్తరీయాన్ని భుజాన వేసుకుని, జేబులోంచి ఒక అర్ధరూపాయి తీసి పనివాడికిచ్చాడు. పనివాడు కనకయ్యకు నమస్కారం చేసి సంతోషంగా వెళ్ళిపోయాడు.

"మరిచిపోయిన ఉత్తరీయాన్ని తెచ్చియిచ్చినందుకు, వాడికి అర్ధరూపాయి ఇవ్వటమా? పావలాయిస్తే సరిపోయేది!" అన్నాడు శంకరయ్య.

కనకయ్య ఉత్తరీయంకేసి ఒకసారి చూసుకుని, "అర్ధరూపాయికి ఇంత ఖరీదైన ఉత్తరీయం లాభం కాదంటావా?" అన్నాడు నవ్వుతూ.

శంకరయ్య తెల్లబోయాడు.

— కె.హనుమంతరావు





# చతురక్షం

కృష్ణాపురం జమీందారు ఒక రోజున గుర్రం మీద వాహ్యాళికి బయలుదేరాడు. ఆ సమయంలో దారిపక్కన వున్న ఒక పొదలో ఈనిన కుక్క ఒకటి, ఇంకా కళ్ళయినా తెరవని తన నాలుగుపిల్లలకు, పడుకుని పాలిస్తున్నది. ఇంతలో ఒకరైతు, తన రెండెడ్ల బండిమీద పొలం నుంచి తిరిగివస్తూ, జమీందారును చూసి కంగారుగా బండిని పక్కకు మళ్ళించాడు. ఆ కంగారులో ఎడ్లు వేగంగా బండిని పొద మీదినుంచి లాక్కుపోవడంతో, పాలిస్తున్న కుక్కమీదినుంచి బండి చక్రాలుదొర్లాయి.

మూడు కుక్కపిల్లలు అక్కడికక్కడే చచ్చిపోయాయి. తల్లికుక్క కూడా, కాసేపు గింజుకుని ప్రాణాలు వదిలింది. ఆ దృశ్యం చూసిన జమీందారు మనసు జాలితో నిండిపోయింది. ఆయన, చావకుండా మిగిలిన కుక్కపిల్లను, దివాణానికి చేర్పించి, జాగ్రత్తగా పెంచమని నౌకర్లకు అప్పచెప్పాడు.

ఆ సమయంలో దివాణంలో వున్న పురోహితుడు, కుక్కపిల్లను చూసి, జమీందారుతో, "ప్రభూ! ఈ కుక్కపిల్ల కంటి పైభాగాన రెండు, కంటి దిగువున రెండు చుక్కలు; మొత్తం నాలుగు చుక్కలు న్నాయి. ఇలాంటి జాతి కుక్కపిల్లను, చతురక్ష మంటారు. ఇలాంటి కుక్కను పాపానికి ప్రతిరూపంగా భావించి, పూర్వం అశ్వమేధయాగం సమయంలో రోకలితో బాదిచంపి, దిగ్విజయం చేసిన రాజులు, దీక్షవహించేవారు. దీన్ని పెంచడం అంత శ్రేయస్కరం కాదు," అన్నాడు.

ఇందుకు, జమీందారు నవ్వి, "నేత్రాలు సూర్యుడికి, మనస్సు చంద్రుడికి, చెవులు

డా॥ జొన్నలగడ్డ మార్కండేయులు

దిక్కులకు, జీవాత్మ ప్రజాపతికి, దేహం లోని పంచప్రాణాలు వాయుదేవుడికి అంటూ; మేకనో, గుర్రాన్నో యజ్ఞపశువును చేసి, ఐదు దినాలు చేసే సోమయాగ, అశ్వమేధయాగాలలో, మనం జీవహింస చెయ్యడంమానేశాం.ఎప్పుడోవేదకాలంలో పాపానికి ప్రతిరూపంగా దీన్ని భావించి చంపేవారని-చతురక్షాన్ని, అందులోనూ, నా వాహ్యాళి కారణంగా తల్లిని పోగొట్టు కున్న సమయంలో, నిర్దాక్షిణ్యంగా వది లెయ్యలేను," అన్నాడు.

పురోహితుడేమీ మాట్లాడలేకపోయాడు. కన్నులపై కింది భాగాలలో చుక్కలతో, చతురక్షం చాలా అందంగా వుండేది. అది ఒక ఏడాది గడిచేసరికి, ఏపుగా పెరిగి దివాణమంతా కలయతిరగడం ప్రారం భించింది.

ఎప్పుడైనా దివాణంలో జమీందారు కొలువు ఏర్పాటు చేస్తే, చతురక్షం వచ్చి, ఆయన ఆసనం పక్కనే పడుకునేది. ఆ సమయంలో పురోహితుడికి, ఒంటిమీద కారం రాసుకున్నట్టుండేది. ఆయన చిరాకు చూసి, అందరూ నవ్వేవారు.

పురోహితుడి చిరాకును ఇంకాఅధికం చేస్తూ, చతురక్షం దివాణాన్ని విడిచిపెట్టి, పురోహితుడి ఇంటికి వచ్చింది. జమీం దారు గారి పెంపుడుకుక్క కాబట్టి, ఇంట్లో వాళ్ళు దాన్ని కొట్టితరిమేయలేక పోయారు.

కొద్ది రోజులు గడిచే సరికి, చతురక్షం, పురోహితుడి ఇంటి వీధి అరుగు మీద పడుకోవడం మొదలు పెట్టింది. ఇది



చూసి పురోహితుడు కోపంగా, "అశ్వమే ధంలో గుర్రం, తన ఇష్టంవచ్చినట్టు తిరిగే దట! ఈ కుక్కేమిటి, నా చుట్టూ తిరుగు తున్నది. ఇంత బతుకు బతికి, శునక మేధం చేస్తున్నానాఏం?" అనుకునేవాడు.

క్రమంగా చతురక్షం, పురోహితుడు ఎక్కడికి వెళితే, అక్కడికి వెంటబడటం ప్రారంభించింది. ఒకరోజు తెల్లవారు జామున, పురోహితుడు గాఢనిద్రలో వున్నాడు. ఆ సమయంలో చతురక్షం, ఆయన మంచం దగ్గరకు చేరి పెద్దగా మొరగసాగింది. ఆయన, "ఛీ!ఛీ!" అని కొడుతున్నా సరే, ఆయన పంచపట్టుకుని లాగడం ప్రారంభించింది.

పురోహితుడు పట్టరాని కోపంతో మంచం దిగి, కుక్కను కర్రతో కొట్టబోయాడు. అది



కేవలం పొగడ్తలతో కస్తూరి పరిమళం నిరూపించబడదు. అదేవిధంగా ఒక వ్యక్తిలో ప్రతిభ ఉన్నట్టయితే అది తానంతట తానే ప్రకాశిస్తుంది.

-సమయోచిత పద్యమాలిక

బయటికి పరిగెత్తింది. ఆ సమయంలో ఏదో బుసకొట్టిన శబ్దం విని, ఆయన కిటికీకేసి చూశాడు. అక్కడ ఆయనకు పడగ విప్పి బుసలు కొడుతున్న తాచు పాము కనిపించింది.

పురోహితుడు భయంతో కంపించి పోతూ, పెద్దగా కేకలు పెట్టాడు. ఇది విని నలుగురూ వచ్చి, పామును కర్రలతో కొట్టి చంపేశారు.

అసలు జరిగిందేమంటే—కొద్దిరోజుల క్రితం, పురోహితుడు తెల్లవారుజామున చెరువుకు స్నానానికి వెళ్ళి, తిరిగి వచ్చేట ప్పుడు మసక చీకట్లో పామును తొక్కాడు. ఆ విషయాన్ని ఆయన గమనించినా, పాములు పగబట్టవనీ, ఒకవేళ పగబట్టి వస్తే, మంత్రంతోకట్టివేస్తాననీ, జమీందారు కొలువులో అందరి ముందు ప్రగల్భాలు పలికాడు.

ఆ రోజు నుంచే చతురక్షం, పురోహితు డింట్లో మకాం పెట్టింది. పగబట్టిన పాము వచ్చిందా, లేక వేరేపాము వచ్చిందా అన్న దాన్నిగురించి, ఎవరికి తోచిన వ్యాఖ్యానం వాళ్ళు చేశారు. చతురక్షం పాము రాకను సూచించి, పురోహితుడి ప్రాణాలు కాపా డడం, విశ్వాసానికి మచ్చుతునక అని, అందరూ దాన్ని మెచ్చుకున్నారు.

పామును చంపి ఎవరిదారిన వాళ్ళు వెళ్ళాక, పురోహితుడు, చతురక్షాన్ని ఎంతో ప్రేమగా నిమిరి, "పాపానికి ప్రతిరూపం అని నిన్ను నిందించాను. ప్రతి జీవిపట్లా కారుణ్యం పెంచుకోవాలన్న వేదవాక్యం విస్మరించాను. ద్వేషించే వారిని కూడా, ఆప దలో రక్షించే మంచిగుణం వుండాలన్న, నీ మూగసందేశం, ఇక నుంచీ నాకు శిరోధార్యం!" అంటూ, ఆ రోజు దానికి స్వయంగా ఆహారం పెట్టాడు.





# స్వర్ణసింహాసనం

6

[కౌండిన్యదేశపు యువరాజు విజయదత్తుడికీ, శ్రీలేఖకూ వివాహం జరిగాక, రాజగురువు సలహామేరకు నగర మైదానంలో తవ్వకాలు ఆరంభమయ్యాయి. మహాసర్పం అడిగిన ప్రశ్నకు విజయదత్తుడు సరైన సమాధానం చెప్పాడు. అపూర్వమైన స్వర్ణసిహాసనం బయటపడింది. పట్టాభిషేకానికి సిద్ధమైన విజయ దత్తుడు సింహాసనంపై కాలుమోపగానే, తొలిమెట్టు మీది సాలభంజిక అతన్ని వారించి, వందల సంవత్సరాలకు పూర్వం అపూర్వసింహాసనం రూపొందిన కారణంగురించి క్లుప్తంగా వివరించి, తాను అడిగే ప్రశ్నకు సరైన సమాధానం చెప్పమని, త్రిపురాంతక దేశాన్ని పాలించిన మూర్ఖరాజు కాలకేతుడి కథను చెప్పసాగింది.
— *తరవాత*]

ఒక శుక్రవారంనాడు, పట్టపురాణి హైమవతి, కులాచారంప్రకారం చిత్రరథస్వామి కోవెలకు వెళ్ళింది. అక్కడ పూజాదికాలు ముగించుకుని ఆమెతిరిగి రాబోతూండగా, మంటపంలో ఒక వారగా కూర్చుని వున్న వృద్ధసాధువొకడు, ఆమె వైపు పరిశీలనగా చూశాడు. అదే సమయంలో తనూ ఆ సాధువువైపు చూసిన హైమవతి, అతడి ముఖంలోని పవిత్రతనూ, ప్రశాంతతనూ గుర్తించి, అప్రయత్నంగాచేతులెత్తి అతడికి నమస్కరించింది.

సాధువు చిరునవ్వుతో ఆమెను ఆశీర్వదిస్తూ, ఒక చిన్న సంస్కృతశ్లోకం చదివాడు. దాని తాలూకు భావం ఇది: సువాసనలు వెదజల్లే అందమైన పూలతో నిండివుండే జాజితీగ, తనకు ఆధారంగా ఏర్పాటు చెయ్యబడిన పందిరి, ముళ్ళతోనిండి వున్నా సరే, ఆప్యాయంగా అల్లుకుపోతుంది! అంత మాత్రాన ఆ జాజిపూల సహజ సౌరభం ఏమాత్రం తగ్గదు సరికదా, ఆ ముళ్ల పందిరి కూడా పదిమందినీ ఆకర్షిస్తూనే వుంటూంది!

లక్ష్మీగాయత్రి



ఆ శ్లోకం వినగానే హైమవతికి, అప్ర యత్నంగా కళ్ళు చెమర్చాయి. ఆపుకోలేని భావోద్వేగంతో ఆమె, సాధువు దగ్గరకు వెళ్ళి, అతడికి ప్రణమిల్లి, అక్కడినుంచి బయలుదేరింది.

ఆ సాయంత్రానికల్లా ఆ సంఘటన చిలవలు పలవలై, రాజుకాలకేతును చేరింది.

శ్రీరామచంద్రుడికి సాటి రాగల ధర్మ ప్రభువుగా తనను తాను భావించుకునే, కాలకేతుడు, కవిత్వంవిన్నందుకు, చెప్పిన వాడికి ప్రణమిల్లినందుకు, పట్టపురాణికి నెల రోజుల కఠినకారాగారశిక్ష విధిస్తూ, సాధువు ఎక్కడున్నా పట్టితేవలసిందిగా భటులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు అతడిని తీసుకురాగానే, మండుటెండలో అతడిని నిలబెట్టి, స్వయంగా దగ్గరవుండి నూరు కొరడా దెబ్బలు కొట్టించాడు. ఆ మూర్ఖ రాజు శాసనానికి తలవొగ్గి, ఇటు పట్టపు రాణి అవమానభారంతో కుమిలిపోతూ కారాగారంలో వుండగా, అటు వృద్ధ సాధువు దాదాపుగా మృతుడై సొమ్మసిల్లి పడిపోయాడు.

ఇదంతా కళ్ళారా చూసిన దేశభక్తుడూ, ఒకప్పటిమహావీరుడూ అయిన వృద్ధసేనాధి పతి శ్రీమల్లుడికి మాత్రం గుండె రగిలి పోయింది. బాగా ఆలోచించి ఒక నిర్ణ యానికి వచ్చిన అతడు, దేశపు సమస్త పరిస్థితులనూ క్లుప్తంగా వివరిస్తూ ఒక లేఖరాసి, "ఈ మూర్ఖరాజు పుణ్యమాఅని, మాదేశప్రజల్లో మానవత్వమూ, చైతన్యమూ నానాటికీ హరించుకుపోతున్నాయి. ఎవరికి వారే 'నా బతుకు నేను బతికితే చాలు' అనుకుంటూ, పక్కవాణ్ణి చంపమన్నా చంపుతున్నారు. ఇదే పరిస్థితి మరికొంత కాలంసాగితే, మాదేశం నలుగురూ ఛీకొ ట్టేలా తయారవుతుంది. ఈ పరిస్థితులను చక్కదిద్ది, ప్రజల్లో చైతన్యం తీసుకురాగల సమర్థులెవరూ లేరు. ఉన్న ఒక్క సమ ర్థుడూ, ముసుగుబిగించి దారితప్పి వ్యవ హరిస్తున్నాడు. నేనా వృద్ధుణ్ణి. ఇక మమ్మల్ని పాలముంచినా, నీటముంచినా-ఆ భారం మీరే వహించవలసిందిగా, నా ప్రార్థన!" అంటూ ముగించి, ఆ లేఖను తన పెంపుడు చిలుకద్వారా, పొరుగు రాజైన చందనవర్మకు పంపాడు.

అప్పటికే త్రిపురాంతక దేశపుపరిస్థితుల గురించి బాగావినివున్న చందనవర్మ, తక్ష

ణమే దండెత్తివచ్చి, రాజు కాలకేతుడిపై అవలీలగా విజయం సాధించాడు.

ఆ తర్వాత, చందనవర్మ ఆజ్ఞప్రకారం కాలకేతు, నగరపు పొలిమేరల్లోవున్న చిన్న ఉద్యానవనంలోని అతి చిన్న ఇంట్లో రాణులతో సహావుంటూ, ఆ వనంలో పని చెయ్యటం ప్రారంభించాడు.

కాలకేతును శిక్షించటం పూర్తయిన వెంటనే చందనవర్మ చిత్రరథుణ్ణి పట్టుకుని తీసుకురావలసిందిగా భటులను ఆజ్ఞాపించాడు. భటులు చెట్టుపుట్టలతో సహా అంతా గాలించారు గాని, చిత్రరథుడి జాడ తెలియలేదు.ఎవరిని ప్రశ్నించినా, అతడి గురించి తమకు తెలియదన్న సమాచారమే వచ్చింది.



"మీరు దండెత్తి రాకముందే, చిత్రరథుడు ఏదోజబ్బు పడివున్నాడని విన్నాను, ప్రభూ! ఇన్నాళ్ళూ అతడి వల్ల ఉపకారం పొందిన ప్రజలే, అతడిని ఎక్కడో దాచి పెట్టి వుంటారు!" అన్నాడు వృద్ధ సేనాని శ్రీమల్లుడు.

ఆ మాట వినగానే వైద్యులందరి మీదా, ఒక కన్ను వేసి వుంచాడు చందనవర్మ. చివరకు అశ్వముఖుడనే వైద్యుడు ఎవరికో రహస్యంగా వైద్యంచేస్తున్నాడని విని, అతణ్ణి రప్పించి పరిపరి విధాల ప్రశ్నించాడు.

అశ్వముఖుడు మొదట్లో తడబడినా, తర్వాత, తను ఎవరికీ రహస్యంగా వైద్యం చెయ్యటం లేదనీ, చిత్రరథుడి గురించి తనకేమీ తెలియదు గాక తెలియదనీ చెప్పేశాడు. అతడు అసత్యమాడుతున్నాడని గ్రహించినా, ఏమీ చెయ్యలేక వూరుకున్నాడు చందనవర్మ.

ఆ మర్నాటి ఉదయానే, చిత్రనేమి అనే ఉన్నతోద్యోగి ఒకడు, చందనవర్మను రహస్యంగా కలుసుకుని, "ప్రభూ! నిన్న అర్ధరాత్రి వేళ, అశ్వముఖుడు ఒంటరిగా ఎక్కడికో వెళుతూండగా వెంబడించి, చిత్రరథుడి జాడతెలుసుకున్నాను!" అని చెప్పాడు.

ఆ మాట వింటూనే చిత్రనేమిని ఒక్కసారి పరిశీలనగా చూసిన చందనవర్మ, వెంటనే అతడితో బయలుదేరి వెళ్ళి, చిత్రరథుణ్ణి స్వయంగా పట్టుకున్నాడు.

ఆ తర్వాత, చిత్రరథుడి జబ్బుకు, చందనవర్మ ఆధ్వర్యంలో, ఆస్థాన ప్రధాన వైద్యుడి ద్వారా వైద్యం జరిగింది. చిత్ర

రథుడు కోలుకోగానే, త్రిపురాంతక దేశానికి, చందనవర్మ నియమిస్తున్న సామంత రాజుగా ప్రకటించబడ్డాడు. వారం రోజుల అనంతరం చందనవర్మ, ప్రజలందరి సమక్షాన చక్రనేమికి నూరు కొరడాదెబ్బలశిక్ష విధించి, తక్షణం అమలు జరిపిస్తూ, "ఇకపై అవినీతికీ, లంచగొండితనానికీ ఎవరుపాల్పడినా, వారిని ఇలాగే కఠినంగా శిక్షించటం జరుగుతుంది. ఇక, నలుగురికీ మంచి చేసి, ప్రజల గౌరవాభిమానాలు సంపాయించుకున్నందుకు గాను, చిత్రరథుణ్ణి సామంతరాజును చేసినా, అతడు కొంత దౌర్జన్యధోరణిలో చెడ్డమార్గంలో నడిచినందుకు గాను, అతణ్ణి కోవెలలో చిత్రరథస్వామికి సేవకుడిగా నియమిస్తున్నాను. ఇకపై ప్రతి ఏకాదశి పర్వదినానా, అతడు స్వయంగా చీపురుచేతబట్టి స్వామి ఆలయాన్ని శుభ్రం చేస్తాడు. మార్గశుద్ధిని అనుసరించని చిత్రరథుడికి మార్గశుద్ధి చెయ్యటమే సరైన శిక్ష!" అన్నాడు.

ఇంతవరకు చెప్పిన సాలభంజిక, "ఓ కాబోయే విజయదత్త మహారాజా! చిత్రరథుడి జాడ గురించి, చక్రనేమి ఒక్కడే సత్యం చెప్పాడు. మిగిలినవాళ్ళందరూ – వైద్యుడు అశ్వముఖుడితో సహా, అందరూ అసత్యమాడుతున్నారని గ్రహించినా, వాళ్ళను పల్లెత్తుమాట కూడా అనని, చందనవర్మ, చక్రనేమికి మాత్రం కఠినంగా శిక్షవేస్తూ, అతడు అవినీతికి పాల్పడినట్టు మాట్లాడాడు. ముసుగుదొంగ అయిన



చిత్రరథుడికి చిన్నపాటి శిక్షవేస్తూ, రాజును చేశాడు. చందనవర్మ దృష్టిలో సత్యం శిక్షార్హం ఎలా అయింది? చందనవర్మ స్థానంలో నువ్వేగనక వుంటే, ఎలా ప్రవర్తి స్తావు? సత్యం శిక్షింపబడటానికి కారణ భూతమైన సూక్ష్మధర్మం ఏమిటో, చెప్పగలి గావా, నీకు తొలిమెట్టు మీద పాదంమోపే అర్హత కలుగుతుంది. చెప్పలేకపోయావో, తక్షణం నీ కళ్ళముందు నుంచి, ఈ స్వర్ణ సింహాసనం మాయమవుతుంది!" అన్నది.



అప్పుడు విజయదత్తుడు, "ఓ, సత్య శక్తీ! నువ్వు చెప్పిన కథలో, రాజు చందన వర్మ ప్రవర్తించిన తీరు, నిస్సందేహంగా ధర్మబద్ధుడూ, సమర్థుడూ అయిన, ఒక పాలకుడి తీరే! కథలో—చిత్రరథుడు, మూర్ఖుడైన తమ రాజువల్ల అష్టకష్టాలు పడుతున్న ప్రజలను ఆదుకుని, వాళ్ళ ఆదరాభిమానాలకు పాత్రుడయ్యాడు. ఇందుకు గాను, అతడు అనుసరించిన మార్గం మంచిదికాని మాట నిజమే కాని, ప్రజలను ఆకలిబాధనుంచి రక్షించాలంటే, ఏదో ఒక తక్షణమార్గాన్ని అనుసరించాలి. చిత్రరథుడు అటువంటి మార్గాన్నే ఎన్ను కున్నాడు. కత్తి చేతబట్టి ఆహారపదార్థాలను బహిరంగంగా తీసుకువెళ్ళిన అతడి చర్యను, దొంగతనంగా వర్ణించటం కూడా సరికాదు. సాధ్యమైనంత అహింసాత్మకంగా వ్యవహరించిన అతడు, ప్రజలకుమరింత ప్రీతిపాత్రుడయ్యాడు. అందుచేతనే, రాజుచందనవర్మఅతడిని, ఎక్కడ శిక్షిస్తాడో ననే భయంతో, అతడిని దాచి పెట్టిన ప్రజలు, తమకేమీ తెలియదని అసత్యమా డారు. ఈ అసత్యం వెనక వున్నవి అభి మానం, కృతజ్ఞత! ఈ అసత్యానికి మూల కారణం దయా, మానవత్వం. అందుకే, ఈ అసత్యం శిక్షింపబడలేదు!

"ఇక పోతే, చిత్రరథుడిలాంటి వాళ్ళను ద్వేషించేది, కేవలం అవినీతిపరులూ, లంచగొండితనంమరిగిన వాళ్ళూ మాత్రమే! వాళ్ళు, చిత్రరథుడు తమకు ఆటంకం అయ్యాడనే కసితో, అతడు శిక్షించ బడాలని కోరుకుంటారు. రాజోద్యోగి చక్రనేమి కూడా అలాంటి వ్యక్తే గనక, చందనవర్మ చేత చిత్రరథుణ్ణి శిక్షింపచేయా లన్న కోరికతో, రాజభటులు కూడా తమకు తెలియలేదని చెప్పిన చిత్రరథుడి జాడతెలుసుకుని, చందనవర్మకు తెలియ



జేశాడు. అతడు చెప్పిన, ఆ సత్యం వెనక వున్నవి కక్షా, ద్వేషమూ. ఆ సత్యానికి మూలకారణం స్వార్థమూ, దయారాహిత్యమూ! ఆ కారణం వల్లనే, అతడు సత్యవాది అయినప్పటికీ శిక్షార్హుడయ్యాడు!

"మనోవాక్కాయ కర్మల్లో, ప్రధానమైనది మనస్సు. ఒక్కొక్కసారి వాక్కు సత్యమైనదైనా, మనస్సు నిర్మలమైనది కాకపోవచ్చు. ఆ సూక్ష్మభేదాన్ని, తన సూక్ష్మబుద్ధితో తెలుసుకోగలిగిన రాజు, ప్రజారంజకుడైన పాలకుడవుతాడు. అటువంటివాడే అయిన చందనవర్మ, ప్రజాహితుడైన చిత్రరథుణ్ణి, రాజును చేస్తూ, అతడికున్న కాస్త మచ్చ కూడా తొలిగించటానికి, అతడికి పవిత్రమైన శిక్ష విధించాడు. యథారాజా, తథా ప్రజా అన్న నానుడి ప్రకారం, చిత్రరథుడి అడుగుజాడల్లో, ప్రజలు కూడా నీతివంతమైన జీవితాన్ని గడపాలన్నది, చందనవర్మ మరొక ఉద్దేశ్యం. నేను చందనవర్మస్థానంలో వున్నా, అలాగే ప్రవర్తించేవాణ్ణి!" అన్నాడు.

అతడి జవాబు వినగానే తొలిమెట్టు మీది సాలభంజిక, "భళీ, భళీ! విజయదత్తా, నాప్రశ్నకు చక్కటి సమాధానం చెప్పి, మొదటిమెట్టు ఎక్కే అర్హత సంపాదించుకున్నావు. నీకిదే నా స్వాగతం!" అన్నది.

సాలభంజిక మాటలు ముగిసిన మరుక్షణం, సభాభవనమంతా సభికుల జయజయధ్వానాలతో మారుమోగిపోయింది. మహారాజు, కొడుకును ఆనందంతో గాఢాలింగనం చేసుకోగా, విజయదత్తుడిరాజ్ఞి శ్రీలేఖ, ఆనందంతో చెమర్చిన కళ్ళను కొనగోట సుతారంగా అద్దుకున్నది.

మహారాజు ఆజ్ఞ మేరకు మంగళ వాద్యాలు మోగటం ప్రారంభించాయి. ఆ నాదాలమధ్య, విజయదత్తుడు తన కుడి పాదాన్ని, స్వర్ణసింహాసనపు తొలిమెట్టు మీదమోపి, అధిరోహించాడు.

ఇక్కడ అంతా ఇలా సంరంభంగా వున్న సమయంలో, అక్కడ కాళిందిదేశంలో మహారాణివసుమతి కూడా ఏదో అవ్యక్తానందంతో చలించిపోతున్నది.ఆమె ఆనందానికి కారణం, ఆరోజుతెల్లవారు జామున, ఆమెకువచ్చిన ఒక శుభస్వప్నమే!

అలాంటి సమయంలో, అక్కడికి ఆమెభర్త మాధవ సేనుడు వస్తూనే, "దేవీ, ఇప్పుడే కౌండిన్య దేశంనుంచి ఒక శుభవార్త చేరింది. విజయదత్తుడు రావటంతోనే,

అక్కడ ఏవోతవ్వకాలు జరిపారట. ఆ తవ్వ కాల్లో అతడికి, ఒకఅద్భుతమైన స్వర్ణసిం హాసనం లభ్యమైనదట. ఆ సింహాసనం పై, విజయుడికి వెంటనే పట్టాభిషేకం జరగవ చ్చునని మనగూఢచారి వార్త పంపించాడు," అన్నాడు.

ఇది వింటూనే, తనస్వప్నం ఫలించినం దుకు మరింత ఉప్పొంగిపోయిన వసుమతి, చేతులు జోడించి భగవంతుడికి నమస్క రిస్తూ, "విజయుడికి అంతటి అపూర్వకాను కను ప్రసాదించిన భగవంతుడు, అతడిని ఎల్లవేళలా చల్లగా చూస్తాడు. ఇంతకూ, ఈ వార్త మరాళుడికి కూడా తెలిసే అవకాశం వున్నదిగదా?" అంటూ ప్రశ్నించింది.

"లేకేం? అతడి గూఢచారిదళం, అత డికి ఈపాటికి వార్త పంపేవుంటుంది. ఏమో, ఏంకానున్నదో! నేటి రాత్రే, మా యుద్ధప్రయాణం," అంటూ కాస్త దిగులు పడ్డాడు, మాధవసేనుడు.

"కలత పడకండి! అంతా మనకు శుభమే జరుగుతుందని తోస్తున్నది. అయితే, మనం మరొక్కపావురం టపాను పంపినట్టయితే, మా అన్నయ్యకూ, విజ యుడికీ మనపై పరిపూర్ణ విశ్వాసం కలు గుతుంది," అన్నది వసుమతి.

మాధవసేనుడు సాలోచనగా, "అలాగే! స్వర్ణసింహాసనాధీశుడైన విజయునికివే, మా ఆశీస్సులు! అని తక్షణం వార్తపంపు తాను," అంటూ అక్కడి నుంచి కదిలాడు, మాధవసేనుడు.

ఆ ప్రకారమే అతడు వదిలిన పావురం, వాయువేగంతో వినువీధిలో ఎగురుతూ, కౌండిన్య వైపుదూసుకొస్తున్న సమయంలో - ఇక్కడ విజయదత్తుడు స్వర్ణసింహాసనపు తొలిమెట్టు మీద, రెండవమెట్టు మీదవున్న సాలభంజిక చెప్పబోయే కథను వినటానికి సిద్ధంగా నిలబడ్డాడు.

అప్పుడు రెండవ సాలభంజిక, "విజయ దత్తా! నా సోదరి అయిన సత్యశక్తి, నన్ను ధర్మశక్తిగానీకు పరిచయం చెయ్యనేచేసింది. ఇక నేను చెప్పబోయే కథ విను!" అంటూ చెప్పటం ప్రారంభించింది.-(ఇంకావుంది)



*ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు-*
*తరతరాలుగా సత్యంకోసం జరిగిన అన్వేషణ!*

# 5. నర్మద కథ

"అమ్మా, మనం వాదోదరకు వెళ్ళినప్పుడు నావయస్సు ఎంత?" అని అడిగాడు తల్లి జయలక్ష్మిని, సందీపుడు.

"అప్పుడు నీకు మూడేళ్ళే. అయినా అది నీకింకా గుర్తుండడం ఆశ్చర్యంగా వుంది," అన్నది జయలక్ష్మి.

"అది నాకు స్పష్టంగా గుర్తులేదుగాని, పడవలో వెళ్ళడం మాత్రం తరచూ జ్ఞాపకం వస్తుంది. నదీ తీరంలోని ఒక భవనంలో ఆ రాత్రి గడిపాము. నాన్న నన్ను భుజాల పైకెత్తుకుని, నీతో కలిసి చెట్లగుంపు పక్కన నడుస్తూంటే సూర్యోదయమయింది. బంగారు బంతిలాంటి ఉదయభానుడి లేత కిరణాలు నదీజలాలను బంగారుప్రవాహంలా మార్చాయి. మీరిద్దరూ ఉదయభానుడికేసిచూస్తూ నన్నూ చూడమన్నారు. ఆ అందమైనదృశ్యం నాకింత వరకు వందసార్లయినా కలలోకి వచ్చి వుంటుంది," అన్నాడు సందీపుడు.

తాత దేవనాథుడితో కలిసి సందీపుడు, శ్యామల ఉదయం ఫలహారం చేస్తున్నారు. తన మనవడూ, కోడలిమధ్య జరుగుతూన్న సంభాషణను దేవనాథుడు గమనించసాగాడు.

"తాతయ్యా! అంత అందమైన సూర్యోదయాన్ని మళ్ళీ నేనెన్నడూ చూడలేదు. కారణం ఏమైవుంటుంది?" అని అడిగాడు సందీపుడు తాతయ్యను ఆశ్చర్యంగా.

"చూసే కళ్ళుండాలే గాని ప్రతిసూర్యోదయమూ అత్యంత సుందరంగానే కనిపిస్తుంది. నీ తల్లిదండ్రులకు ఆ సూర్యోదయాన్ని నెమ్మదిగా పరిశీలించి చూసే ఓర్పూ, ఉత్సాహం వుండి, నిన్నూ చూడమన్నారు గనక నువ్వు దానిని పరిశీలించి చూశావు. అది నీకు అద్భుతదృశ్యంగా కనిపించింది. ఆ అందమైన దృశ్యం నీ జ్ఞాపకంలో శాశ్వతంగా నిలిచి పోవడానికి మరొక కారణం కూడా ఉన్నది," అన్నాడు దేవనాథుడు.

"అది కర్నాలి. నర్మదా నదీతీరంలోని ఒక ఆశ్రమంలో ఆ రాత్రి గడిపాము. ఆకాశాన్నంటే వృక్షాలతో, మనోహరదృశ్యాలతో నిండిన





అద్భుత ప్రాంతం అది!" అన్నది జయలక్ష్మి. "తాతయ్యా! ఆ దృశ్యం ఇంకా జ్ఞాపకం ఉండడానికి మరొక కారణం కూడా వుంది అన్నారు కదా! అదేమిటి?" అని అడిగాడు సందీపుడు.

"ఆ కారణాన్ని కొద్దిగా వివరించాలి. పైగా దానిని పసిపిల్లలు అర్థంచేసుకోలేరేమో!" అన్నాడు దేవనాథుడు అనుమానంగా.

"అలా అయితే, ఆ విషయం సందీపుడికి వద్దు. నాకు చెప్పండి. సందీపుడు పసివాడు. నేను పెద్దదాన్ని. నాన్న నన్ను 'బామ్మా' అని పిలవడం నీకు తెలిసిందే కదా!" అన్నది శ్యామల నవ్వుతూ.

ఆ మాటకు దేవనాథుడు నవ్వాడు. "మీ ఇద్దరి మీదా నాకు సంపూర్ణ విశ్వాసం ఉన్నది. నేను మీకు చెప్పడానికి కాస్తవెనకాడిన విషయాన్ని అర్థం చేసుకునే తెలివితేటలు, శక్తి సామర్థ్యాలు మీకున్నాయి. అసలు సంగతి చెబుతాను జాగ్రత్తగా వినండి. మనిషి అన్న వాడు కేవలం శరీరం, ప్రాణం, మనస్సు ఈ మూడూ కలిసిన వాడు మాత్రమేకాదు. ఈ మూడింటికీ ఆధారంగా ఆత్మ ఉన్నది. బాల్యంలో ఈ ఆత్మ మరింత వికాసంతో వ్యక్తి జీవితంలో ప్రధానంగా ముందు వుంటుంది. అందమైనవస్తువులకూ, దృశ్యాలకూ సులభంగా స్పందిస్తుంది. ప్రేమానురాగాల పట్ల సులభంగా ఆకర్షింపబడుతుంది. అయితే, వయసు



పెరిగేకొద్దీ-లాభ నష్టాల లెక్కలతో మనసూ, ఇష్టాయిష్టాలతో ప్రాణశక్తీ మనిషిని ఎక్కువగా ప్రభావితంచేస్తాయి. క్రమంగా వాటిదే పై చేయి అవుతుంది. అందువల్ల అందంపట్లా, అద్భుత దృశ్యాల పట్లా, మంచి విషయాల పట్లా ఆకర్షణ, స్పందన తగ్గిపోతాయి. అర్థమయిందా?" అన్నాడు దేవనాథుడు.

"బాగా అర్థమయింది, తాతయ్యా! అన్నయ్యకన్నా చిన్నదాన్ని గనక నాలో శరీరం కన్నా ఆత్మ ముందున్నది. మీరు చెప్పిన అద్భుతవిషయంనాకు ఇట్టే అర్థమైపోయింది!" అన్నది శ్యామల నవ్వుతూ.

సందీపుడి ఆలోచనలు కాలానికి ఎదురీదుతూ కర్నాలి కేసి పయనించసాగాయి. "తాతయ్యా! గంగానదికి ఉన్నట్టే నర్మదానది పుట్టుకకు సంబంధించిన కథ కూడా ఉన్నదా?" అని అడిగాడు సందీపుడు.

"అవును, మననదులు చాలా వాటి ఆవిర్భావానికి సంబంధించిన కథలు ఉన్నాయి. నర్మద జన్మవృత్తాంతం మధురమైనది; కవితాత్మకమైనది," అంటూ దేవనాథుడు ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు పరమశివుడు అమరకంటక పర్వత శిఖరాగ్రం మీద కూర్చుని ధ్యానంలో నిమగ్నమైపోయాడు. ఆయన ప్రశాంత అద్భుత సౌందర్యం నుంచి ఒక అందమైన కన్య వెలువడి, ఆయన పాదాలకు ప్రణమిల్లింది.

కరుణాసింధువు అయిన పరమశివుడు ఆనందించి, "బిడ్డా! నువ్వు నా మనసుకు మార్దవం కలిగించావు. అంటే మృదుత్వం ప్రసాదించావు. కాబట్టి నీ పేరు నర్మద. నీకేంవరం కావాలో కోరుకో!" అన్నాడు.

'నేను సర్వవేళలా, సర్వావస్థలలో స్వతంత్రంగా మసలే వరం ప్రసాదించు తండ్రీ!" అని ప్రార్థించింది నర్మద.



"అలాగే!" అని వరమిచ్చాడు పరమశివుడు.

నర్మద ఆడుతూ, పాడుతూ దేనిని గురించీ విచారం లేకుండా హాయిగా కొండలలో, కోనలలో విహరించసాగింది.

త్వరలో ఆమె అందచందాలు, నాట్య విన్యాసాలు పలువురు దేవతల దృష్టిని ఆకర్షించింది. ఒక దివ్యపురుషుడు ఆమె ఎదుట కనిపించి, ఆమెను పట్టుకోబోయాడు. ఆక్షణమే, ఆమె జలంగా మారి ఆ దివ్యపురుషుడి వేళ్ళ సందుల్లో జారి పోయి, నేలమీద నదిగా ప్రవహించ సాగింది!

"మహావిష్ణువు కరుణ గంగగా అవతరించినట్టే, పరమశివుడి అపార కరుణ నర్మద రూపంలో ప్రవహించిందన్నమాట!" అన్నాడు దేవనాథుడు.

"చాలా బావుంది!" అన్నాడు సందీపుడు. శ్యామల చప్పట్లు చరిచింది.

"మనదేశంలోని నదులు, కొండలు, అడవుల వెనక చాలా కథలున్నాయి. ఆ కథల్లో చాలావరకు ప్రతీకాత్మకమైనవి. అయితే కాలం గడిచే కొద్దీ, వాటి ప్రతీకలు మరుగున పడిపోయాయి," అన్నాడు దేవనాథుడు బాధగా.

"అవి కేవలం కథలుగా కూడా చాలా ఆసక్తికరంగా ఉన్నాయి, తాతయ్యా!" అన్నాడు సందీపుడు.

"గంగ, నర్మద....వాటి పేర్లు కూడా ఎంత అందంగా ఉన్నాయో, చూడు!" అన్నది శ్యామల.

"మన దేశంలోని వివిధ ప్రాంతాల ప్రాచీన నామాలు ఎంతో మధురంగా ఉండేవి. ఇప్పటి పాట్నా ప్రాచీన నామం ఏమిటో మీకు తెలుసా?" అని అడిగాడు దేవనాథుడు.

"పాటలీపుత్రం," అన్నారు ఇద్దరూ ఒక్కసారిగా.

"అవును, నిజమే. అయినా అంతకు పూర్వం దానిని పుష్పపూర్, కుసుమపూర్ అనేవారు. అంటే, పూలనగరం అన్నమాట. తిరువనంతపురం అంటే అనంత ప్రభువు

కొలువుండే పవిత్ర నగరం అని అర్థం. ద్వారక పేరు ద్వారావతి; గుల్‌మార్గ్ అసలు పేరు గౌరీమార్గ్. అంటే హిమవంతుడి కుమార్తె పార్వతి (గౌరి) పేరు మీదుగా ఆ పేరు ఏర్పడిందన్న మాట. లక్నో పాత పేరు లక్షణావతి. లక్ష్మణుడి పేరు మీదుగా లక్షణావతి వచ్చివుంటుంది. గౌహతి పూర్వనామం ప్రాగ్జ్యోతిషపురం. అంటే తూర్పుకు వెలుగు నగరం అన్నమాట. గోవా పేరు గోమంతం. పాండిచ్చేరి అసలు పేరు వేదపురి. అంటే వేదాధ్యయన కేంద్రం అన్నమాట. మధురా పురి మధుర అయినట్టు అజయ్-మేరు అజ్మీరు అయింది. కులూ పాత పేరు కులాంత పీఠ. అంటే పవిత్ర మానవ నివాసానికి చిట్ట చివరి భాగం అన్న మాట. కిన్నావూర్ పాత పేరు కిన్నరపురి. అంటే, కళలలో ఆరితేరిన దివ్య పురుషుల నివాసస్థానం. పైథాన్ ప్రాచీన నామం ప్రతిష్ఠానపురం! ఇలా ఎంతయినా చెప్పుకుంటూ వెళ్ళవచ్చు," అని ఆగాడు దేవనాథుడు.

ఆ తరవాత ఆయన మళ్ళీ, "ఇంతెందుకు ఇప్పటి మన రాష్ట్రాల పాత పేర్లు కొన్ని పరిశీలించండి. ఎంత భావగర్భితంగా ఉన్నాయో మీకు తెలుస్తుంది. కర్ణాటక పూర్వనామం కుంతలదేశం; పంచ్-ఆబ్ (అయిదు నదులు) పంజాబ్ అయింది. బుద్ధవిహారాలనుంచి బీహార్ వచ్చింది. కశ్యపముని పేరు మీదుగా వున్న సరస్సు కశ్యప్-మీర్ నుంచి కాశ్మీరు ఏర్పడింది!" అన్నాడు.

"జమ్మూ అనే పేరు ఎలా వచ్చింది, తాతయ్యా?" అని అడిగాడు సందీపుడు.

"తొమ్మిదవ శతాబ్దానికి చెందిన జంబులోచనుడనే రాజు పేరు మీదుగా వచ్చింది. మన నగరాలలో చాలావాటి పేర్లు ప్రముఖులైన రాజులు, మునుల పేర్ల మీదుగానే ఏర్పడ్డాయి. గ్వాలిపుడనే పురాతన ముని పేరు మీదుగానే గ్వాలియర్ ఏర్పడింది. నాగార్జునుడనే బౌద్ధగురువు పేరు మీదుగా నాగార్జున కొండ ఏర్పడింది. జాబాలి పేరు మీదుగా జబల్‌పూర్ ఏర్పడిందని చెబుతారు. ఇలా చెప్పుకుంటూ వెళితే జాబితా మరీ పెద్దదైపోతుంది!" అంటూ దేవనాథుడు లేచి నిలబడ్డాడు.

పిల్లలు బడికి వెళ్ళడానికి సిద్ధం కాసాగారు.

—(ఇంకావుంది)



# వ్యాపార రహస్యం

హేలాపురిలో వుండే దుర్గయ్య, ఒక పచారీ దుకాణం యజమాని. న్యాయంగా సరుకులు తూచియిస్తాడని అతనికి మంచిపేరు. అతడి వ్యాపారం లాభసాటిగా జరుగుతూండగా, సుగంధపురి నుంచి వచ్చిన మల్లయ్య అనే వ్యాపారి, దుర్గయ్య దుకాణానికి ఎదురుగా, తనూ ఒక పచారీ దుకాణం తెరిచాడు. కొద్దిరోజుల్లో మల్లయ్య దుకాణానికి గిరాకీ పెరిగి పోయింది. దుర్గయ్య దుకాణానికి ఎంతో కాలంగా ఖాతాదారులుగా వున్నవాళ్ళు కూడా, మల్లయ్య దుకాణంలో సరుకులు కొనడం మొదలుపెట్టారు. క్రమంగా దుర్గయ్య వ్యాపారం తగ్గుముఖం పట్టింది.

ఇలా ఎందుకు జరిగిందో, ఎంత ఆలోచించినా దుర్గయ్యకు అంతుబట్టలేదు. ఇద్దరి దుకాణాల్లోని సరుకులూ ఒకే నాణ్యత కలవి. ఎందువల్లనంటే – ఇద్దరూ సరుకులు టోకుగా పట్టణంలోని విశ్వేశ్వరయ్యశెట్టి దగ్గర నుంచే కొనితెస్తూంటారు.

దుర్గయ్య ఒకనాడు ఉండబట్టలేక, మల్లయ్యను దీన్ని గురించి అడిగాడు. మల్లయ్య చిరునవ్వు నవ్వి, "దుర్గయ్యా! ఇది వ్యాపార రహస్యం. అయినా, తోటి వ్యాపారివి అడిగావు గనక చెపుతున్నాను. నువ్వు సరుకులు తూచేటప్పుడు, ముందుగానే సిబ్బెలో ఎక్కువవేసి, తూకానికి తగ్గట్టుగా అందులోంచి కొంచెం, కొంచెంగా సరుకు తీసేస్తూండడం, నేను గమనించాను. కాని, నేను సిబ్బెలో ముందుగా తక్కువ సరుకు వేసి, తూకానికి తగ్గట్టు మరి కొంచెం, కొంచెంగా వేస్తూంటాను. ఖాతాదారులు నువ్వు సరుకు తగ్గించేస్తున్నావన్న భావనలోనూ, నేను సరుకు ఎక్కువయిస్తున్నానన్న భావనలోనూ వుంటున్నారు. కాని, ఇద్దరం ఒకే రకంగా యిస్తున్నాం. అదే నీకూ, నాకూ తేడా!" అన్నాడు.

ఈ రహస్యం తెలిసిన దుర్గయ్య, తనూ అదేపద్ధతి అవలంబిస్తూ, మల్లయ్యతో సమానంగా వ్యాపారం సాగించాడు.

–కోనే నాగవెంకట ఆంజనేయులు





# అజమాయిషీ

రమాపతి అనే సంపన్నుడు పట్నంలో వుంటున్నాడు. కొంతకాలంగా ఆయనకు మనశ్శాంతి కరువైంది. ఒకరోజున సాధు వొకడు అతిథిగా ఆయనింటికి వచ్చాడు. భోంచేశాక సాధువు, "నువ్వు ఉత్తముడివి. చేసే మంచి పనులు త్రికరణశుద్ధిగా చేస్తున్నావు," అని రమాపతిని మెచ్చుకున్నాడు.

రమాపతి వినయంగా, "స్వామీ! నేనేమి చేసినా త్రికరణశుద్ధిగానే చేస్తున్నాను. అలాంటప్పుడు నా మనసు ప్రశాంతంగా వుండాలి. కానీ కొంతకాలంగా నాకు మనశ్శాంతి కరువైంది," అన్నాడు.

రమాపతి భార్య అనుకూలవతి. పిల్లలు బుద్ధిమంతులు. బంధువులు మంచి వారు. ఎక్కణ్ణించీ ఏ కలతలూ లేవు!

ఈవివరాలు తెలుసుకున్నాక సాధువు కాసేపు ఆలోచించి, "నీకు ఈ పట్నంలో కాక ఇంకెక్కడైనా ఆస్తులున్నవా?" అని అడిగాడు.

రమాపతికి చుట్టుపక్కల వున్న అయిదారు గ్రామాల్లో పొలాలున్నవి. వాటిని కౌలుకు తీసుకున్న రైతులు ప్రతిసంవత్సరం సక్రమంగా ఒప్పందం ప్రకారం ధనధాన్యాలు చెల్లిస్తున్నారు.

"బాగా ఆలోచించు. ఆ పొలాల విషయంలో నీకు అసంతృప్తిని కలిగించే విశేషం ఒక్కటీ లేదా?" అని నొక్కించి అడిగాడు సాధువు.

రమాపతి కాసేపాలోచించి, "విదురపురంలో మా తాతలుకట్టించిన రామాలయమున్నది. దానికి నూరెకరాల మాన్యాన్ని కూడా, మాపూర్వీకులిచ్చివున్నారు. రామాలయంలో వేడుకలువైభవంగా జరిగేవట! కానీ రెండు మూడు సంవత్సరాలుగా వేడుకలు గాడితప్పాయనీ, పూర్వపు వైభవం లేదనీ చెప్పుకుంటున్నారు. తన బాగోగులు శ్రీరాముడే చూసుకోగలడని, నా నమ్మకం," అన్నాడు.

"వసుంధర"



సాధువు మందహాసం చేసి, "నాయనా! శ్రీరాముడు తన నివాసం వెతుక్కోలేడనా మీపూర్వీకులు, ఆయనకు ఆలయం కట్టించారు? తనక్కావలసిందిసంపాదించు కోలేడనా ఆయనకు నూరెకరాల మాన్య మిచ్చారు? ఇన్ని చేసి, బాగోగులవిషయం ఒక్కటీ ఆయనకు విడిచి పెట్టడం భావ్యంగా వుందా?" అన్నాడు.

ఈ ప్రశ్నకు రమాపతి కలవరపడుతూ, "పూర్తిగా ఆయనకు విడిచి పెట్టలేదు, స్వామీ! ఏటా శ్రీరామనవమికి కళ్యాణం జరిపించడానికి నేనూ, నా భార్యా వెళు తూంటాం. రెండు సంవత్సరాలుగా, ఆ వేడు కలో ఏదో లోటుందనిపించింది. పనులు శ్రద్ధగా జరగడం లేదు తప్పితే, అక్కడున్న వాళ్ళందరూ నీతిపరులే! రామ భక్తులే! అందువల్లనే ఇంకేంచేయాలో తెలియక, అంతా ఆ రాముడికే విడిచి పెట్టాను," అన్నాడు.

"విడిచి పెట్టానని నువ్వనుకుంటున్నావు కానీ, అదే నీమనస్సులో అశాంతికి కారణం. విదురపురంలో శ్రీరాముడికి వేడుకలు చక్కగా జరిగితేనే, నీకు తిరిగి మనశ్శాంతి కలుగుతుంది," అన్నాడు సాధువు.

రమాపతి కాసేపు మౌనంగావూరుకుని, "స్వామీ! మీరు చెబుతూంటే నిజమేననిపి స్తున్నది. కానీ భక్తి నాలో జీర్ణించుకుపో యినా, దానివల్ల ఎవరికి ప్రయోజనం? శ్రీరాముడికి వేడుకలు బాగా జరగడం వల్ల మాత్రం, ఎవరికి ప్రయోజనం? తమరు నాకు తత్వోపదేశం చేసి, మన శ్శాంతి కలిగించండి!" అన్నాడు.

సాధువు నవ్వి, "నీ పూర్వులు కట్టించిన రామాలయం, ఎందరికో జీవనాధారమవు తున్నది. పాపాత్ములను పాపాలు చేయ కుండా నిరోధించడానికీ, పుణ్యాత్ములను పుణ్యాలు చేయడానికీ పురికొల్పుతున్నది. ఆ ఆలయాన్ని సక్రమంగా నడిపించడం, నీ బాధ్యత. ఆ బాధ్యతను విస్మరిస్తే, నీకు మనశ్శాంతి ఎలాకలుగుతుంది?" అన్నాడు.

"అయితే, నేనిప్పుడేంచేయాలి, స్వామీ?" అని అడిగాడు రమాపతి.

"ఏ ఆలయమైనా సరైన వారి అజమా యిషీలో వుంటేనే సక్రమంగా పనిచే స్తుంది. నువ్వు విదురపురం వెళ్ళి, సరైన వ్యక్తిని నియామకం చెయ్యి. పరిస్థితులు చక్కబడతాయి," అన్నాడు సాధువు.

"స్వామీ! రామాలయంలోని పూజారులనూ, పండితులనూ అజమాయషీ చేయడానికి, రెండేళ్ళక్రితం వరకూ రామశేఖరుడనే వృద్ధుడుండేవాడు. ఆయనకు ఏ బాదరబందీ లేదు; ఒక్కడే. తన కాలాన్నంతా రామాలయంలోనే గడిపేవాడు. ఆయన పోయాక, ఆ బాధ్యత ఉద్దాలకుడనే అతడికి అప్పజెప్పబడింది. అప్పటి నుంచీ రామాలయం వేడుకలు చప్పబడ్డాయి!" అని ఆగాడు రమాపతి.

ఇది వింటూనే సాధువు, రమాపతికేసి గుచ్చిచూస్తూ, "ఔనా మరి, ఇంకేం! నేను చెప్పిందే నిజం. లోపం ఉద్దాలకుడి అజమాయిషీలోవున్నది. అతణ్ణి తొలగించి, సమర్థుణ్ణి నియమించు," అన్నాడు.

దీనికి రమాపతి వినయంగా, "ఉద్దాలకుడికి పూజావిధానం తెలుసు.సంగీతంలో ప్రవేశముంది. కావ్యాలు చదివాడు; అల్లగలడు కూడా! పద్దులు రాయడంలో, తప్పులు లేకుండా లెక్కలు కూడడంలో అతడికి అతడే సాటి. రామాలయం అజమాయిషీకి అంతకంటే సమర్థుడుండడు. అక్కడి వారందరికీ అతడి నీతి, నిజాయితీల మీద చెప్పలేనంత నమ్మకముంది," అన్నాడు.

సాధువు ఆశ్చర్యపడి, "బహుశా, రామశేఖరుడితడికంటే సమర్థుడైవుండాలి!" అన్నాడు.

"లేదు స్వామీ! రామశేఖరుడికి రామభక్తి తప్ప ఇంకేమీ తెలియదు," అన్నాడు రమాపతి.



ఇది ఇంకా విచిత్రంగా తోచింది సాధువుకు. ఆయన వెంటనే, "ఎక్కడో ఏదో తిరకాసుంది. అది తెలుసుకునేందుకు, నేను నీతో విదురపురం వస్తాను. నీకు చేతనైన సాయం చేస్తాను," అన్నాడు.

మర్నాడు సాధువు, రమాపతి విదురపురం వెళ్ళి, అక్కడి పరిస్థితులను శ్రద్ధగా గమనించారు.

ఉద్దాలకుడుసకలసద్గుణ సంపన్నుడూ, సకలశాస్త్ర పారంగతుడూ అనడంలో సందేహం లేదు. అయితే, భార్య మాట అతడికి వేదవాక్కు!

ఉద్దాలకుడి భార్య సుశీలకూడా పరమ భక్తురాలు. అందరికీ సాయపడాలనుకునే మంచిబుద్ధి ఆమెది. అయితే, ఆమెకు గుర్తింపు రావాలన్న తాపత్రయమెక్కువ.

సుశీల హడావుడైతే పడగలదు కానీ, ఏ పనిలోనూ ఆమెకు సామర్థ్యం లేదు. తన పనులన్నీ ఆమె భర్తచేత చేయిస్తుంది. ఈ కారణాలవల్ల, ఉద్దాలకుడికి చేతి నిండా పని వుంటున్నది. అతడితోపాటు కొందరు దేవాలయంపనివారిని కూడా సుశీల తన పనులకు ఉపయోగించు కుంటున్నది. ఆ విధంగా దేవాలయం పనులు కుంటుపడుతున్నాయి.

ఈ పరిస్థితిని గమనించిన సాధువు, రమాపతితో, "నాయనా! నువ్వు ఉద్దాలకుణ్ణి పదవిలోంచితొలగించు. దేవాలయం అజమాయిషీ సుశీలకు అప్పగించు," అన్నాడు.

రమాపతి తెల్లబోయి, "అదెలావీలవుతుంది, స్వామీ! ఆమెకు దేవాలయం అజమాయిషీకి అవసరమైన ఒక్కవిద్యలో కూడా ప్రవేశం లేదు," అన్నాడు.

సాధువు నవ్వి, "అజమాయిషీతో పనులు చేయించుకోవడం, ఒక ప్రత్యేకమైన విద్య! ఉద్దాలకుడికి ఆ విద్య అబ్బలేదు. అందువల్ల, దేవాలయంలో ఎవరి చేతా సక్రమంగా విధులు నిర్వర్తింప చేయలేక పోతున్నాడతడు. ఇప్పుడు దేవాలయం అజమాయిషీ ఆమెకిస్తే, అందుకామె ఎంతో గర్వపడుతుంది. ఆమెకు గుర్తింపు కోసం తాపత్రయమున్నదని, ఈ పాటికి నువ్వు గ్రహించివుండాలి. ఆమెకు ఏవిద్య లోనూ నైపుణ్యం లేకపోయినా, ఇన్ని పనులూ ఉద్దాలకుడిచేత చేయిస్తుంది. ఉద్దాలకుణ్ణి పనిలోంచి తొలగించానని నువ్వనుకున్నా, నిజానికి అతడు దేవాలయం పనిలో వున్నట్టేలెక్క! సుశీలను అతడిపై అజమాయిషీకి నియామకంచేసినట్టు గ్రహించు. అర్థమయిందా?" అన్నాడు.

మారు మాట్లాడకుండా రమాపతి, సాధువు చెప్పినట్టేచేశాడు. పేరుకు సుశీలదే అజమాయిషీ అయినా, మొత్తంపని అంతా ఉద్దాలకుడు చేసేవాడు. రామాలయంలో వేడుకలు పూర్వపు వైభవాన్నిపొందాయి. అందుకు సుశీల అజమాయిషీయే కారణమని పేరువచ్చింది.

అజమాయిషీ గురించి ఒక గొప్పజీవిత సత్యాన్ని తెలుసుకున్న రమాపతికి, ఆ తర్వాత మనశ్శాంతికి లోటు లేదు.



కావేరీ తీర ప్రయాణం-8

# ప్రాచీనమైన ఆనకట్ట

రచన: జయంతి మహాలింగం

చిత్రాలు : గౌతంసేన్



సెయింట్ జాన్స్ చర్చ్

పురాతన హైందవ ఆలయాలకే కాకుండా, 18,19వ శతాబ్దాలలో బ్రిటిష్ వాళ్ళు నిర్మించిన అందమైన క్రైస్తవ ఆలయాలకూ, బ్రహ్మాండమైన భవనాలకూ తిరుచిరాపల్లి ప్రసిద్ధిగాంచింది. 1766వ సం॥లో తెప్పకుళా(తటాకం)నికి ఉత్తర దిశలో క్రీస్తు చర్చ్ నిర్మించబడింది. 1816వ సం॥లో కంటోన్‌మెంట్ ప్రాంతంలో కోటకు దక్షిణంగా సెయింట్‌జాన్స్‌చర్చ్ నిర్మించబడింది. తటాకసమీపంలో అవర్‌లేడీ ఆఫ్‌లూర్డ్స్ అనే కేథలిక్ కెథడ్రల్ 1840లో నిర్మించబడింది. రాబర్ట్‌క్లైవ్ నివసించిన భవనం, ఇవాళజిల్లాలో పేరుగాంచిన సెయింట్ జోసెఫ్స్ కాలేజీలో భాగంగా ఉంటున్నది.

శ్రీరంగం దీవిలోనే తిరువానైక్కాలో జంబుకేశ్వర శివాలయం ఉన్నది. ఎత్తయిన గోపురాలతో, రాతిస్తంభాల మంటపాలతో, అద్భుతమైన శిల్పాలతో ఇది ఆ ప్రాంతానికే శోభను సమకూరుస్తున్నది. సంగం కాలంలో అంటే, దాదాపు క్రీ.పూ.1వ శతాబ్దంలో కోచెంగణ్ణన్ అనే చోళ రాజు దీనిని నిర్మించాడని చెబుతారు.



జంబుకేశ్వర ఆలయం

దేవాలయంలోని అప్పు(జల)లింగం చాలా కిందికి వుండడం వల్ల దీని చుట్టూ ఎప్పుడూ నీటి ఊట ఊరుతూ వుంటుంది. ఈ ఆలయ ప్రాంతంలో ఒకప్పుడు జంబూ(నేరేడు)వృక్షాలు ఎక్కువగా ఉండేవి. ఒక నేరేడు చెట్టు కింద శివ



ఏనుగు ప్రతినిత్యం లింగాన్ని అభిషేకించసాగింది.

లింగం ఒకటి వుండేది. ఆ కాలంలో ఒక ఏనుగూ, సాలెపురుగూ శివభక్తి కలిగి వుండేవి. తాను కొలిచే లింగం మీద దుమ్మూ, చెత్తా చెదారం పడకుండా సాలెపురుగు శివలింగం పైన గూడు అల్లేది. ఏనుగు తొండంతో కావేరీ నుంచి నీళ్ళు తెచ్చి శివలింగాన్ని అభిషేకించేది. దాంతో సాలెపురుగు అల్లిన గూడు నీళ్ళలో కొట్టుకుపోయేది. ఇలా కొన్ని రోజులు గడిచాయి. ఏనుగు చర్యకు ఆగ్రహం చెందిన సాలెపురుగు, ఏనుగుకు తెలియకుండా దాగి వుండి, దాని తొండంలోకి జొరబడి లోపల కుట్టి చంపేసింది. ఆ సాలెపురుగే మరుజన్మలో ఉరైయూర్ రాజధానిగా చోళరాజ్యాన్ని పాలించిన కోచెంగణ్ణన్‌గా జన్మించిందని స్థలపురాణం చెబుతుంది.

విశాలమైన దేవాలయానికి బ్రహ్మాండమైన ద్వారగోపురాలూ, ఐదుప్రాకారాలూ ఉన్నాయి. రెండవ, మూడవ ప్రాకారాల నిర్మాణం 13వ శతాబ్దంలో జరిగింది. నాలుగవ ప్రాకారంలో అందమైన అఖిలాండేశ్వరి అమ్మవారి ఆలయం ఉన్నది. అమ్మవారి విగ్రహం నేత్రాలు సజీవంగా మిరమిట్లుకొలిపేలా ఉన్నాయి. ఒకానొకప్పుడు అమ్మవారి ఉగ్రదృష్టికి తట్టుకోలేక పూజారులు సైతం గర్భగృహంలో ఎక్కువ సేపు ఉండలేక పోయేవారట. ఈ ఆలయాన్ని సందర్శించిన ఆదిశంకరులు, అమ్మవారికి చక్రాలు పొదిగిన తాటంకాలు(కమ్మలు) అలంకరించి, ఆమె ఉగ్రదృష్టిని శాంతపరచాడట. అప్పటి నుంచి దేవత శాంతస్వరూపిణి అయిందని చెబుతారు. కర్ణాటక సంగీత ముమ్మూర్తులలో ఒకరైన ముత్తుస్వామిదీక్షితులు అమ్మవారిని దర్శించి, ఆమెను కీర్తిస్తూ అద్భుతమైన కృతిని రచించారు.

తమిళనాడులోని శివాలయాలలో తిరువానైక్కాకు విశిష్టస్థానం ఉన్నది. చోళరాజులతో పాటు హోయసాలులు, పాండ్యులు, నాయక రాజులు ఈ ఆలయానికి మడులు మాన్యాలిచ్చి పోషించారు. మొదటి ఆలయం శతాబ్దాలతరబడి మార్పులు, చేర్పులతో పునర్నిర్మాణాలతో అభివృద్ధి సాధించింది. కర్నాటక యుద్ధంలో ఫ్రెంచి సైన్యం, బ్రిటిష్ సైన్యంనుంచి తప్పించుకొని జంబుకేశ్వర ఆలయంలోనే దాక్కున్నది. శత్రుసేనలకు లొంగిపోయింది కూడా ఇక్కడే!

శ్రీరంగం దీవికి 2కి.మీ. దూరంలో కావేరీ నుంచి కొళ్ళిడంశాఖ విడిపోతుంది. ఈ ప్రాంతంలో బ్రహ్మాండమైన రాతి ఆనకట్ట 'కల్లణై' నిర్మించబడింది. క్రీ.శ.2వ శతాబ్దానికి చెందిన చోళరాజు కరికాలుడు దీనిని నిర్మించాడని చెబుతారు. ఈ ఆనకట్ట నిర్మాణాన్ని-కావేరీజలాలను వ్యవసాయానికి మళ్ళించడానికీ, వెల్లువలను అరికట్టడానికీ జరిగిన మొట్టమొదటి పెద్ద ప్రయత్నంగా చెప్పవచ్చు. ఈ ఆనకట్ట 329 మీ. పొడవూ; 12-18మీ. వెడల్పూ; 4-5 మీ. లోతూ కలిగి వున్నది. 1800 ప్రాంతంలో సర్ ఆర్థర్ కాటన్ నేతృత్వంలో బ్రిటిష్ ఇంజినీర్లు కావేరీ డెల్టా పథకం కింద ఈ ఆనకట్టను పూర్తిగా పునర్నిర్మించడంతో తొలి ఆనకట్ట ఇప్పుడు కనిపించడం లేదు. 1806వ సం॥లో దీని ఎత్తు పెంచారు. 1830వ సం॥లో పెద్దపెద్ద ద్వారాలు, తలుపులతో కలుజులు (తూములు) నిర్మించారు. వాటి నిర్మాణ సమయంలో బ్రిటిష్ ఇంజినీర్లు-కేవలం బంకమన్నుతో ఒకటిగా చేర్చబడిన పెద్దపెద్దబండలు నీటి ప్రవాహవేగానికి ఎదురునిలిచి, ఆపడం చూసి అమితాశ్చర్యం చెందారు.

కల్లణైకి 32 కి.మీ. ఎగువ 1836-38 మధ్యకాలంలో కాటన్ దొర పర్యవేక్షణలో ఎగువ ఆనకట్ట నిర్మించబడింది. ఈ ఆనకట్ట ద్వారాలు అమర్చిన 22 తూములతో 780 మీ. పొడవూ, 2మీ. ఎత్తూ కలిగివున్నది. 1890-1904 మధ్యకాలంలో దీనిని పూర్తిగా పునర్నిర్మించవలసి వచ్చింది.



బ్రహ్మాండమైన రాతి ఆన కట్ట

కల్లణైకి దిగువ 1851వ సం॥లో చిన్న చిన్న నదులలోకి నీటి సరఫరాను అదుపు చేయడానికి కావేరి-వెణ్ణార్ రెగ్యులేటర్లు అమర్చారు. వెణ్ణార్, కణ్ణనార్, బామిని, కుదరముట్టి అరసలార్ మొదలైన చిన్న చిన్న నదులు తంజావూరు జిల్లా కావేరి డెల్టాలోని సారవంతమైన భూములను సస్యశ్యామలం చేస్తున్నాయి.

ఆనకట్టకు ఉత్తర దిశగా రాజరాజ చోళుడి కుమారుడైన రాజేంద్ర చోళుడి ప్రాచీన రాజధాని గంగై కొండ చోళపురం ఉన్నది. ఆయన ఇక్కడ

బృహదీశ్వరాలయం నిర్మించి, గర్భగృహంలో 3.9మీ॥ ఎత్తయిన శివలింగాన్ని ప్రతిష్ఠింప జేశాడు. ఈ శివలింగమే దక్షిణ భారతదేశంలో అతి పెద్దది. ఆయన ఉత్తరాదిని జయించిన విజయోత్సవం జరుపుకోవాలనుకున్నాడు. ఆయన సేనలు బెంగాల్ వరకూ వెళ్ళి, గంగా జలాన్ని తీసుకు వచ్చాయి. అందుకే ఆయనకు 'గంగైకొండచోళన్' అనే బిరుదనామం ఏర్పడింది. బృహదీశ్వరాలయంలోని శిల్పసౌం దర్యం తంజావూరు పెద్దగుడి శిల్పసౌందర్యా నికి తీసిపోదు. ప్రధాన ద్వారగోపురం అంత



గంగైకొండచోళపురం దేవాలయం

ఎత్తుగా లేకపోయినప్పటికీ దేవాలయం చాలా విశాలమైనది. శిల్పాలు విలక్షణమైనవి. మహా మంటపానికి ఎదురుగా వున్న నంది విగ్రహం తంజావూరులోని నందిలాగే ఉన్నది. కారణం ఫలానా అని తెలియదుకాని, కొంతకాలానికి ఈ నగరాన్ని ప్రజలు వదిలిపెట్టడం జరిగింది.

ఆ తరవాతి శతాబ్దాలలో ఆలయం నిర్లక్ష్యానికి గురయింది. కొళ్ళిడానికి అడ్డుగా కొత్త ఆనకట్ట నిర్మించినప్పుడు, బ్రిటిష్ ఇంజినీర్లు ఆలయ ప్రాకారంలోని బండరాళ్ళను దానికి ఉపయోగించారు.

మొత్తం తంజావూరు డెల్టా ఒకప్పుడు చోళమండలంగా పిలువబడేది. ఈ ప్రాంతం మీద చోళుల ప్రభావం అటువంటిది. క్రీ.శ.9వ శతాబ్దంలో విజయాలయ చోళుడు తంజావూరును వశపరచుకున్నాకే అది చోళుల రాజధాని అయింది. సంగం కాలంలోనే చోళవంశస్థులు కావేరీ డెల్టా ప్రాంతాన్ని పాలించేవారు. విజయాలయుడూ, ఆ తరవాత ఆయన కుమారులు ఆదిత్యుడూ తమ పూర్వ ప్రాంతాన్ని వశపరచుకున్నారు. దక్షిణ భారతదేశంలో శక్తివంతమైన సామ్రాజ్యాన్ని స్థాపించారు. చోళులపాలన 13వ శతాబ్దం వరకు కొనసాగింది.



# తరంగిణి తెలివి

చింతలపూడి అనే గ్రామంలో వుండే చెన్నయ్య ఇరవై ఏళ్ళవాడు. చిన్నతనం లోనే తల్లితండ్రులు పోగా, వాణ్ణి పెంచి పెద్దచేసిన అవ్వ, చనిపోయే ముందు, వాడికి తను కూడబెట్టిన ఐదువేల రూపాయలు అటకమీద జాడీలోవున్నవని చెప్పి, "ఒరే, చెన్నా! నువ్వు అమాయకుడివి, భయస్థుడివి. ఈ సంగతి గ్రామంలో అందరికీ తెలుసు. కనక, నువ్విక్కడ సుఖంగా బతకలేవు. అందువల్ల, డబ్బు తీసుకుని పట్నం వెళ్ళి, నాలుగుగేదెలు కొనుక్కుని పాలవ్యాపారం చేసుకో. నోరులేని జీవాలు నీకు కీడు చెయ్యవు!" అని చెప్పింది.

చెన్నయ్య, అవ్వ చెప్పినట్టే చేయాలనుకుని వారం తర్వాత పట్నం ప్రయాణానికి ఏర్పాట్లు చేసుకోసాగాడు. పట్నంలో ముందు అద్దె ఇల్లొకటి చూసుకుని, తర్వాత సామానుతీసుకుని వెళ్ళిపోవాలన్నది వాడి ఆలోచన. అయితే, ఇంట్లో ఐదువేలు వుంచి, ఇంటికి తాళం పెట్టడం ప్రమాదం! అవ్వ అప్పుడప్పుడు, గ్రామంలోని షావుకారుశెట్టి దగ్గిరడబ్బు దాచడం ఎరిగివున్న చెన్నయ్య, డబ్బును ఒక సంచీలో వేసుకుని ఆయన దగ్గరకు వెళ్ళాడు.

ఆ సమయంలో శెట్టికీ,ఆయన భార్యకూ తగువు జరుగుతున్నది. రెండు రోజుల్లో రాబోతున్న తన తల్లి కోసం కొత్త చీర ఒకటి కొనుక్కురమ్మని పోరు పెడుతున్నది, శెట్టి భార్య. ఆమె తల్లి, మొక్కుబడి తీర్చేందుకు తిరుపతిపోతూ, దారిలోవున్న తన కూతురింట ఒకరోజు గడపబోతున్నది.

"దారేపోయే వాళ్ళందరికీ చీరలూ సారెలూ పెడితే, ఇల్లుగుల్లవుతుంది, వల్లకాదు!" అంటూ అరుస్తున్నాడు శెట్టి..

"మా అమ్మ అట్లా దారేపోయేమనిషా? ఒక చీర తెస్తే, నీ కొంపేమీ కూలదులే!" అంటూ, భర్తకంటే బిగ్గరగా అరిచింది శెట్టి భార్య.

మాచిరాజు కామేశ్వరరావు



"చీరకాదు ముందు కూరమాడుతున్న ట్టున్నది, వంటింట్లోకి తగలడు!" అన్నాడు శెట్టి, వంటింటికేసి చేయివూపుతూ.

చెన్నయ్య రావడంచూసి శెట్టిభార్య అప్ప టికి మౌనంగావంటింట్లోకి వెళ్ళిపోయింది.

చెన్నయ్య తన ప్రయాణం గురించి శెట్టికి చెప్పి, 'రెండురోజుల్లో అక్కడ అద్దె ఇల్లుచూసుకుని వచ్చేస్తాను. అప్పటి దాకా, ఈ ఐదువేలూ మీ ఇంట్లో దాచి పెడితే, మీ మేలు మరవను!" అన్నాడు, డబ్బుసంచీ శెట్టి చేతికియిస్తూ.

"దానికేంభాగ్యం, చెన్నయ్యా! దిక్కు లేనివాళ్ళకు సహాయపడితే, ఆ పుణ్యం ఊరికేపోదు గదా!" అన్నాడుశెట్టి.

ఆ సమయంలో, భర్తమీదకోపంతో ఉడికిపోతున్న శెట్టిభార్య, కాళ్ళతో నేలను గట్టిగా తాటిస్తూ మంచినీళ్ళకుండ ఎత్తి బలంగా గోడకేసికొట్టింది.

ఆ ధ్వనికి హడలిపోయిన చెన్నయ్య, "ఇల్లంతా అదిరిపోతున్నది! ఏమిటీ విపరీతం, శెట్టిగారూ?" అన్నాడు.

ఏం చెప్పాలో తెలియని శెట్టి, "అదా... భూకంపం, చెన్నయ్యా, భూకంపం! నువ్వు క్షేమంగా పట్నంవెళ్ళి, లాభంగా తిరిగిరా," అంటూ చెన్నయ్యనుబయటికి సాగనంపాడు.

చెన్నయ్య మర్నాడు పట్నంచేరి, అద్దె ఇంటికోసం అక్కడాయిక్కడా తిరిగి విసిగి పోయి, సాయంత్రానికి పట్నానికి పెడగా వున్న ఒక ఇంటినిచూసి, మంచినీళ్ళకోసం, ఆ ఇంటి తలుపు తట్టాడు.

ఒకపద్దెనిమిదేళ్ళ అమ్మాయి తలుపు తీసి, "ఏంకావాలి?" అన్నది చెన్నయ్య వంక అనుమానంగా చూస్తూ.

"మంచినీళ్ళు," అన్నాడు చెన్నయ్య.

"నాన్నా, నువ్విలారా! ఎవరో వచ్చారు," అంటూ పెరట్లో వున్న తండ్రిని కేకపెట్టి, ఆయన వచ్చాక మంచినీళ్ళు తీసుకురావ డానికి లోపలికి వెళ్ళిందామె.

దిక్కులు చూస్తున్న చెన్నయ్యతో, "ఏమీఅనుకోకు, బాబూ! నేనూ, అమ్మాయి తరంగిణీ మాత్రమే, ఈ లంకంత ఇంట్లో వుంటున్నాం. కొత్తవాళ్ళు ఎవరు వచ్చినా కొద్దిగా భయంగానూ, అనుమానం గానూ వుంటుంది. పక్కవాటా అద్దెకు ఇద్దా మంటే–పట్నానికి దూరం కదా! ఎవరూ రావడంలేదు," అన్నాడు తరంగిణి తండ్రి ముకుందం.

చెన్నయ్య, తరంగణి తెచ్చియిచ్చిన మంచినీళ్ళు తాగి, తను ఎందుకు పట్నం వచ్చాడో చెప్పి, 'గేదెలను పెట్టుకోవడానికి అభ్యంతరంలేకపోతే, మీ పక్కవాటాలోకి అద్దెకు వస్తాను," అన్నాడు.

ముకుందం, చెన్నయ్య పేరు అడిగి తెలుసుకుని, "నువ్వు రేపే మా ఇంటికి అద్దెకు రావొచ్చు. అద్దె ఎంత ఇచ్చినా ఫర్వాలేదు," అన్నాడు ఆనందంగా.

తరంగిణి కల్పించుకుని, "ఏవ్యవహారం అయినా ఖచ్చితంగా తేల్చుకోవాలి. అద్దె నెలకు వందరూపాయిలు!" అన్నది.

రెండు రోజుల్లో సమాను తీసుకుని వచ్చేస్తానని చెప్పి, తన ఊరు తిరుగు ప్రయాణమయ్యాడు చెన్నయ్య.



చెన్నయ్య, శెట్టి ఇంటికి తను దాచిన డబ్బు తీసుకోవడానికివెళ్ళేసరికి, నలుగురి తోపిచ్చాపాటీ మాట్లాడుతున్నాడు, శెట్టి.

'నేను పట్నం వెళ్ళిపోతున్నాను, శెట్టి గారూ!" అన్నాడు చెన్నయ్య.

"శుభం, వెళ్ళిరా!" అన్నాడు శెట్టి.

'వెళ్ళాక తిరిగి వచ్చేదిలేదు. అక్కడ గేదెలు కొని పాలవ్యాపారం మొదలు పెడతాను. నా ఐదువేలూ ఇవ్వండి," అన్నాడు చెన్నయ్య.

"ఐదువేలా? ఏమిటీ రూపాయలే! ఐదు కాన్లకు కొరగాని వెర్రివెధవ్వి, నాదగ్గర ఐదువేలు దాచావా! ఎప్పుడూ?" అంటూ కళ్ళెర్రచేశాడు శెట్టి.

చెన్నయ్య నివ్వెరపోయి, "ఎప్పుడంటారేమిటి? భూకంపం వచ్చిన రోజున యిచ్చాను. దయచేసి నెమ్మదిగా గుర్తుచేసుకోండి," అన్నాడు.

శెట్టి భళ్ళుననవ్వి, "నేను పుట్టిబుద్ధెరిగి, భూకంపం రాలేదీ ఊళ్ళో. మీరెవరైనా ఎరుగుదురా?" అని అడిగాడు చుట్టూ వున్న వాళ్ళను.

"ఎరగం! ఎరగం!" అన్నారు వాళ్ళు.

"అవ్వ పోయాక అమాయకపు వెధవకు అతితెలివి అబ్బినట్లుంది! అవతలికిపో," అంటూ చెన్నయ్యను తరిమేశాడు శెట్టి.

శెట్టితో గట్టిగా పోట్లాడలేక, లోలోపల దుఃఖిస్తూ, పట్నానికి వెళ్ళి, జరిగిందంతా ముకుందానికి చెప్పి, "ఇక ఆ ఊళ్ళోనే, ఆపసీయాపసీ చేసుకుని పొట్టపోసుకుంటాను. మీ ఇంట్లో అద్దెకు రావడం లేదని చెప్పడానికే వచ్చాను," అన్నాడు చెన్నయ్య.



ఇది విన్న ముకుందం బాధగా, "అలాగేలే, బాబూ! ఎవరికెక్కడ ప్రాప్తమో!" అన్నాడు. ఐతే, పక్కనేవున్న తరంగిణి కల్పించుకుని, "అదేంమాట, నాన్నా! ఆ శెట్టిలాంటి మోసకారిని మార్చలేకపోయినా, ఈయన డబ్బు తిరిగివచ్చేలా చేయవద్దూ," అన్నది.

"సరే, మనమేంచేయగలం?" అన్నాడు ముకుందం నిరాశగా.

తరంగిణి కొంతసేపు ఆలోచించి, "ఇలాచేయండి!" అంటూ, ఏంచేయాలో ఇద్దరికీ వివరించి చెప్పింది. కూతురు ఇచ్చిన రేకుపెట్టె చేత్తోపట్టుకుని, అప్పటికప్పుడు చెన్నయ్య వెంట వాళ్ళ ఊరుకు బయల్దేరాడు ముకుందం.

వాళ్ళు ఊరు చేరేసరికి బారెడు పొద్దెక్కింది. చెన్నయ్య, శెట్టిఇల్లు ముకుందానికి చూపించి, తనుమాత్రం వీధిమొగలోనే ఆగిపోయాడు.

ముకుందం, శెట్టి ఇంటికి వెళ్ళేసరికి, శెట్టి ముందు గదిలో కుర్చీలో కూర్చుని వున్నాడు. ముకుందాన్ని చూస్తూనే "ఎవరు? మీరు ఏం పని మీద వచ్చారు?" అని అడిగాడు గుచ్చిగుచ్చిచూస్తూ.

"అయ్యా, నేను చెన్నయ్య కాబోయే మామగారిని," అన్నాడు ముకుందం, శెట్టి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంటూ.

చెన్నయ్య పేరు వింటూనే శెట్టి ఉలిక్కిపడి, "ఇంతకూ మీరొచ్చిన పనేమిటో చెప్పలేదు," అన్నాడు.

"చెన్నయ్య పెళ్ళి, ఇక్కడి రామాలయంలో చేస్తానని అతడి అవ్వ మొక్కుకున్నదట! పెళ్ళిఖర్చులకోసం డబ్బుతెచ్చాను అరవైవేలు," అంటూ ముకుందం, పక్కనే వున్న రేకు పెట్టెచూపించి, "పెళ్ళిపనులు ఆరంభమయ్యాక, అవసరాన్ని బట్టి కొద్దికొద్దిగా డబ్బుతీసుకుంటాను. పెద్ద గృహస్థులు! దీన్ని మీ దగ్గిరే వుంచండి! శ్రమ యిస్తున్నాను," అన్నాడు.

"శ్రమా! మీరు పెద్దవారు. ఏదో ప్రాధేయపడుతున్నట్టు మాట్లాడకూడదు, ఆజ్ఞాపించాలి. డబ్బును మహారాజుగా మా ఇంట్లోదాచుకోవచ్చు," అన్నాడు శెట్టి అతి వినయంగా.

ఇంతలో చెన్నయ్య హడావిడిగా లోపలికి వచ్చి, శెట్టితో, "నేను రెండురోజుల క్రితం వచ్చినప్పుడు-మీకు ఐదువేలు ఏరోజు ఇచ్చానని అడిగారు కదా? ఆరోజు

మీ ఇంట్లో కూరమాడిపోయింది, ఏదో భూకంపంకూడా వచ్చిందన్నారు," అన్నాడు, తరంగిణి అనమన్నట్టుగా.

శెట్టికుర్చీలోంచి లేచి, చెన్నయ్య భుజం మీదచెయ్యివేసి, "నువ్వు నాదగ్గర ఐదు వేలు దాచడం గుర్తులేకకాదు, ఆ రోజు నిన్ను గట్టిగాకొసిరింది. ఆ సమయంలో నా పక్కన ఒక జూదరీ, తాగుబోతూవున్నారు. వాళ్ళకు అప్పుగా డబ్బుకావాలట, లేద న్నాను. ఒకవేళ నీ ఐదువేలూ నీకిస్తే, వాళ్ళు నిన్ను వెంబడించి భయపెట్టి, ఆ డబ్బు గుంజుకు పోయేవాళ్ళు. నువ్వసలే అమాయకుడివి, పిరికివాడివి. ఇదుగో, ఇప్పుడే నీ ఐదువేలూ ఇస్తాను," అంటూ లోపలిగదిలోకి పోయి, డబ్బు సంచీ తెచ్చి చెన్నయ్యకిచ్చాడు.

చెన్నయ్య డబ్బు అలా అతడికి చేర గానే, ముకుందం కుర్చీలోంచి దిగ్గున లేచి, శెట్టితో, "అయ్యా, మీ మేలు ఈ జన్మకు మరవలేను. మీ మాటలవల్ల, ఈ చెన్నయ్యనైజం ఎలాంటిదో తెలిసిపోయింది. మా అమ్మాయి తరంగిణికి అమాయకు లన్నా, పిరికివాళ్ళన్నా తగని రోత! నేనీ పెళ్ళి చేయదలచలేదు!" అంటూ రేకు పెట్టె తీసుకుని బయటికి నడిచాడు.

చాలాబరువుగావున్నట్టుకనబడే పెట్టెతో ముకుందం, వెనకనే ఐదువేలరూపాయల సంచీతో చెన్నయ్యా పోతూంటే, "అయ్యో, అరవై వేలు చేజారిపోయాయే!" అను కుంటూ శెట్టి, కుర్చీలో చేరగిలపడి పోయాడు.

రెండురోజుల్లో పట్నం మకాంమార్చిన చెన్నయ్య; ముకుందం, తరంగిణులకు ఎంతగానో కృతజ్ఞతలు చెప్పుకుని, "నా జీవితం నిలబెట్టిన పుణ్యం మీదే! మీ రుణం ఎలాతీర్చుకోగలను," అన్నాడు.

ఆ మాటలకు ముకుందం నవ్వి, "మా అమ్మాయిని పెళ్ళి చేసుకుని! నీ మంచిత నానికి, మా తరంగిణి తెలివితేటలు తోడ యితే, మీ జీవితం మూడు పూవులూ, ఆరుకాయలుగా వుంటుంది," అన్నాడు.

తనకు అంత అదృష్టం పట్టడం నమ్మ లేక, చెన్నయ్య ఆశ్చర్యంగా తరంగిణికేసి చూశాడు. ఆ ఆలోచన తనదే అయినం దుకు సిగ్గుతో తలదించుకున్నది, తరంగిణి.



# సృజనాత్మక పోటీలు

సాధారణ ప్రచురణకు ఎంపికయిన ఫిబ్రవరి నెల సామెత (దూరపు కొండలు నునుపు) కథ

## పట్నవాసం!

శ్రీవల్లభాపురంలోని రామచంద్రయ్య రెండెకరాల పొలం వున్న చిన్నరైతు. ఆయన భార్య రమణమ్మ. వారికి నలుగురు పిల్లలు. ముగ్గురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. రామచంద్రయ్య తల్లి మాణిక్యమ్మ కొడుకుతోనే ఉంటున్నది.

రమణమ్మకు పట్నంబతుకుమీద మోజు ఎక్కువ. ఆమె కారణంగానే పెద్ద కూతురికి తమస్థాయికి మించి పట్నం సంబంధం చేశారు. అప్పులు పెరిగిపోయాయి. వాటిని తీర్చడానికి ఉన్న పొలంతో పాటు మరి రెండు ఎకరాలు కౌలుకు తీసుకున్నాడు రామచంద్రయ్య. అయితే ఆ సంవత్సరం వర్షం కురవక, పంటలు బాగా పండలేదు. దాంతో అప్పులు తీరే మార్గం కనిపించలేదు. పట్నం వెళితే ఏదో ఒకపని చూసుకుని అప్పులు తీర్చవచ్చనీ, పిల్లల్ని బాగా చదివించవచ్చనీ రమణమ్మ భర్తను పోరసాగింది. రామచంద్రయ్య మొదట అయిష్టంగా వున్నా, ఆ తరవాత భార్య మాటలు బాగా చెవికెక్కాయి. ఉన్న ఇల్లును తాకట్టు పెట్టి, సొంతపొలాన్ని కౌలుకిచ్చి ఆ డబ్బుతో భార్యాపిల్లలు పట్నం చేరారు. "దూరపు కొండలు నునుపు అని తెలియక వెళుతున్నారు. నేను మాత్రం ఇల్లు విడిచిరాను," అని మాణిక్యమ్మ మాత్రం ఆ ఊళ్ళోనే ఉండిపోయింది.

పట్నంలో రామచంద్రయ్య ఒక కంపెనీలో పనికి కుదిరాడు. రమణమ్మ రెండు గేదెలు కొనుక్కుని పాలవ్యాపారం ప్రారంభించింది. అయినా, వచ్చే ఆదాయం ఇంటి అద్దెకూ, పిల్లల కాన్వెంటు చదువులకూ చాలక అవస్థ పడసాగారు. అయినా పట్నవాసం రమణమ్మకు ఆనందంగానే ఉన్నది. నాలుగేళ్ళు గడిచేసరికి పరిస్థితులు మరీ దిగజారాయి. రెండవ అమ్మాయి పెళ్ళీడుకొచ్చింది. వస్తున్న డబ్బు, ఖర్చులకు బొటాబొటీగా సరిపోవడం వల్ల, అప్పులు వడ్డీలతో కలిసి పెరిగిపోసాగాయి. పదవ తరగతిలో మంచి మార్కులతో ఉత్తీర్ణుడైన కొడుకు, చెడు సావాసాల కారణంగా ఇంటర్‌లో అత్తెసరు మార్కులతో బయటపడ్డాడు. వీటన్నిటినీ చూస్తూంటే, ఊరు వదలిపెట్టి రావడం పెద్ద పొరబాటన్న పశ్చాత్తాపం రామచంద్రయ్యను దహించసాగింది. దానికి తోడు తాను పనిచేస్తున్న కంపెనీ మూతపడడంతో, ఏం చేయడమా అని భయం పట్టుకున్నది. నిద్రకరువయింది. విచారం క్రమంగా మనోవ్యాధిగా మారింది.

భర్త మానసిక పరిస్థితి రమణమ్మను కూడా ఆలోచింపచేసింది. పట్నం వచ్చి, బాగా సంపాయించి, పిల్లల్ని బాగా చదివించి నలుగురిలో గర్వంగా నిలబడాలన్న ఆమె ఆశ అడియాస అయింది. ఊళ్ళోనే ఉన్నట్టయితే అద్దెలకూ, చదువులకూ ఇంత ఖర్చయ్యేది కాదు. అప్పుల్లో కొంతలో కొంతయినా తీరేది. ఉన్న ఊరునూ, కన్నతల్లిలాంటి అత్తనూ వదిలిరావడం పొరబాటని గ్రహించి ఆమె బాధపడసాగింది.

రాత్రి భోజనం వడ్డిస్తూ రమణమ్మ భర్తతో, "ఇన్నాళ్ళూ ఇక్కడ రెక్కలు ముక్కలు చేసుకుని కష్టపడింది చాలు. సొంత ఇంట్లో ఉంటూ, సొంత పొలం చేసుకుంటూ మహారాజులా బతికిన మిమ్మల్ని పట్నం తీసుకువచ్చినందుకు క్షమించండి. మనం మళ్ళీ మన ఊరు వెళదాం!" అన్నది.

"అలాగే! దూరపు కొండలు నునుపు అని, మా అమ్మ ఆరోజే ఎందుకన్నదో నాకు ఇప్పుడు తెలిసి వచ్చింది!" అన్నాడు రామచంద్రయ్య.

మళ్ళీ తమ సొంతఊరు వెళదామన్న నిర్ణయంతో ఆ దంపతుల మనసులు తేలికపడ్డాయి!

—టి. సీతామహాలక్ష్మి, సాతూరు.

52. శిఖండి కథ

# మహాభారత్

భీష్ముడు దుర్యోధనుడికి ఉభయపక్షాల వీరులను గురించి వివరంగా చెప్పిన మీదట దుర్యోధనుడు ఆయనను, "తాతా, శిఖండి యుద్ధానికి వస్తే అతన్ని ఎందుకు చంపనంటావు? సోమకులతో సహా పాంచాలులందరినీ చంపుతానని నువ్వు ముందు చెప్పి ఉన్నావే?" అని అడిగాడు.

దానికి భీష్ముడు ఇలా సమాధానం చెప్పాడు:

"నేను శిఖండిని యుద్ధరంగంలో ఎందుకు ఎదుర్కోనో చెబుతాను, ఈ రాజులందరితో పాటు నువ్వుకూడా విను. నా తండ్రి శంతనమహారాజు రాజ్యపాలన చేసి చనిపోయిన అనంతరం, నేను చిత్రాంగదుణ్ణి రాజుగానూ, విచిత్రవీర్యుణ్ణి యువరాజుగానూ అభిషేకించాను. కొంతకాలానికి చిత్రాంగదుడు పోయాడు. అప్పుడు నేను విచిత్రవీర్యుణ్ణి రాజును చేసి అతనికి నేను అండగా ఉంటూ రాజ్యపాలనచేశాను.

"అతనికి యుక్తవయసు వచ్చింది. అతనికి తగిన కన్యను చూసి పెళ్ళి చేయ నిశ్చయించాను. ఆ సమయంలో కాశీ రాజు కూతుళ్ళు ముగ్గురు స్వయంవరం చేసుకోబోతున్నారని తెలిసింది. వాళ్ళు మంచి అందగత్తెలు. వాళ్ళ పేర్లు అంబ, అంబిక, అంబాలిక. స్వయంవరానికి రాజులందరూ ఆహ్వానించబడ్డారు. నేను ఒంటరిగా రథం మీద కాశీరాజధానికి వెళ్ళి, సాటిలేని అందగత్తెలయిన రాజ కుమార్తెలను చూశాను. స్వయంవరానికి వచ్చిన రాజులందరినీ కూడా చూశాను. నేను వారినందరినీ నాతో యుద్ధానికి ఆహ్వానించి, రాజకుమార్తెలను ముగ్గురినీ నా రథంలో ఎక్కించుకున్నాను.





'రాజులారా, నేను ఈ ముగ్గురు కన్యలనూ తీసుకుపోతున్నాను. నేను శంతనుడి కొడుకును. నా పేరు భీష్ముడు. మీకు చేతనైతే ఈ కన్యలను విడిపించుకోండి, అని నేను రాజులతో అన్నాను. వాళ్ళకు నా మీద చాలాకోపం వచ్చి, రథాల మీదా, ఏనుగుల మీదా, గుర్రాల మీదా ఆయుధాలు ఎత్తి, నా మీదికి యుద్ధానికి వచ్చారు. నేను వాళ్ళను బాణవర్షంలో ముంచి, ఓడించాను. వాళ్ళు పారిపోయారు.

'నేను కాశీరాజు కుమార్తెలను తీసుకు వచ్చి, సత్యవతికి చూపి, వాళ్ళను విచిత్రవీర్యుడికి భార్యలుగా తెచ్చానని చెప్పాను, ఆమె నేను చేసిన పనికి చాలా సంతోషించింది. నేను పెళ్ళిప్రయత్నాలు చేస్తూంటే, కాశీరాజు పెద్దకూతురు, అంబ తాను సాళ్వరాజును ప్రేమించాననీ, తాము వివాహం చేసుకోవటానికి నిశ్చయించుకున్నామనీ, ఈ సంగతి తన తండ్రికి తెలియదనీ, తనను సాళ్వరాజు వద్దకు చేర్చమనీ ప్రార్థించింది. నేను మా తల్లి సత్యవతితోనూ, మంత్రి పురోహితులతోనూ సంప్రదించి, అంబకు దాసీలనూ, రక్షకులనూ తోడు ఇచ్చి, సాళ్వుడి వద్దకు పంపేశాను.

"కాని సాళ్వుడు ఆమెను స్వీకరించక, భీష్ముడు బలాత్కారంగా తీసుకుపోయిన కన్య తనకు అవసరం లేదన్నాడు. 'నేను భీష్ముడికి భార్యను కాలేదు. ఆయనే నన్ను సగౌరవంగా నీ వద్దకు పంపాడు,' అని అంబ అన్నది. ఆమె ఎంత బతిమాలినా, ఏడ్చినా సాళ్వుడు మనసు మార్చుకోక, 'నీ ఇష్టంవచ్చిన చోటికి వెళ్ళు,' అన్నాడు.

"అంబ తన దుస్థితికి ఎన్నో కారణాలు ఉన్నప్పటికీ, నా మీదనే పగపట్టి ఋషులుండే ఆశ్రమాలకు వెళ్ళింది. అక్కడ శైఖావత్యుడనే ముని అంబకు కలిగిన కష్టం తెలుసుకుని, 'అమ్మాయీ, ఇక్కడ తపస్సు చేసుకునే మునులు నీ కష్టాలను ఏం తీర్చగలరు?' అన్నాడు. తనకుజీవితం మీద విరక్తి కలిగిందనీ, తనకు తపస్సు చేసుకునే పద్ధతి తెలుపమనీ అంబ ఆయనను వేడుకున్నది.

"తరవాత ఆశ్రమ వాసులైన మునులందరూ కలిసి ఆమెను గురించి చర్చించారు, కాని ఏ నిర్ణయమూ చెయ్యలేకపోయారు. వాళ్ళు ఆమెను ఆమె తండ్రి ఇంటికి వెళ్ళమన్నారు. అందుకు అంబ

ఒప్పుకోలేదు; తపస్సు చేసుకుంటాననీ, ఆ విధానం చెప్పమనీ అన్నది.

ఆ సమయంలో అక్కడికి హోత్రవాహనుడనే రాజర్షి వచ్చాడు. ఆయన అంబకు తల్లివైపు తాత. ఆయన అంబ కథ విని చాలా విచారించి, 'అమ్మా, నువ్వు తపస్సు చెయ్యలేవు. జమదగ్ని కొడుకైన పరశురాముడి వద్దకు వెళితే, ఆయన నిన్ను భీష్ముడి దగ్గరికి చేర్చగలడు. అందుకు భీష్ముడు ఒప్పుకోక పోతే, యుద్ధంచేసి భీష్ముణ్ణి చంపగలడు,' అన్నాడు.

"పరశురాముడు మహేంద్రపర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు. కాని ఆయన మర్నాడు ఈ ఆశ్రమానికే వస్తున్నట్టు వార్త తెలిసింది. మర్నాడు పరశురాముడు అక్కడికి రానే వచ్చాడు. అక్కడి మునులు, అంబతో సహా, ఆయనకు అతిథిపూజలుచేశారు. మాటలసందర్భంలో హోత్రవాహనుడు పరశురాముడికి తన కూతురి కూతురైన అంబకథ చెప్పి, ఆమె కష్టం తీర్చమన్నాడు.

"అమ్మాయీ, నువ్వు భీష్ముడి వద్దకు పోతావా? సాళ్వుడి వద్దకు పోతావా? ఏది కావాలంటే అది నేను సమకూర్చగలను, అని పరశురాముడు అంబతో అన్నాడు. తన కష్టాలకు మూలం భీష్ముడేననీ, అతన్ని చంపితే గాని తన పగచల్లారదనీ అంబ పరశురాముడితో అన్నది.

"పరశురాముడు నన్ను చంపటానికి ఒప్పుకోలేదు గాని, అంబను నా వశం చెయ్యటానికీ. నేను అంగీకరించకపోతే



నాతోయుద్ధంచెయ్యటానికీఒప్పుకున్నాడు. ఆయన అంబనూ, కొంతమంది ఋషులనూ వెంటబెట్టుకుని కురుక్షేత్రానికి వచ్చి, సరస్వతీనదీ తీరాన విడిసి, తన కోరిక నెరవేర్చమని నాకు కబురు పంపాడు. నేను ఒక గోవునూ, బ్రాహ్మణులనూ వెంటబెట్టుకుని ఆయనను చూడబోయి, ఆయనకు తగిన పూజలు చేశాను.

"పరశురాముడు నన్ను చూసి, 'భీష్మా, నువ్వు స్త్రీనికోరని వాడివిగదా, ఈ అంబను ఎందుకు బలాత్కారంగా పట్టుకుపోయావు? పట్టుకుపోయిన వాడివి నీ దగ్గర ఉంచుకోక ఎందుకు పంపేశావు? నీ మూలంగా ఈమె జీవితం భ్రష్టమయింది గద! నువ్వు పట్టుకుపోయిన ఈ పిల్లను మరెవరు పెళ్ళాడతారు? సాళ్వుడు ఈమెను నిరా



కరించాడు. అందుచేత ఈమెను నువ్వే పరిగ్రహించు," అన్నాడు.

"ఆ మాటకు నేను, ఆమెను నా తమ్ముడికిచ్చి పెళ్ళిచెయ్యననీ, తనకు సాళ్వుడిపైన మనసున్నట్టు ఆమే చెప్పిందనీ, ఆమెకోరి సాళ్వుడి వద్దకు వెళ్ళిందనీ పరశురాముడికి చెప్పాను.

"ఆ మాట విని పరశురాముడు, నేను తన మాటవినకపోతే నన్నూ, నా మంత్రులనూ చంపుతానన్నాడు. నేను ఆయనను శాంతపరచటానికి చూశాను. ఆయన నాకు అస్త్రాలిచ్చిన గురువు. ఆ మాట చెప్పాను. అయితే గురువు ఆజ్ఞ పాటించమని ఆయన పట్టుపట్టాడు. గురువు కాదు గదా, ఇంద్రుడే వచ్చి అధర్మం చెయ్యమన్నా నేను చెయ్యనన్నాను; తప్పనిసరి అయితే యుద్ధం చేస్తానన్నాను. మా ఇద్దరికీ కురుక్షేత్రంలో మర్నాడు యుద్ధం జరిగేటట్టు ఏర్పాటుచేసుకున్నాం. నేను హస్తినాపురానికి తిరిగివచ్చి, సత్యవతికి సంగతంతా చెప్పి, ఆమె ఆశీర్వాదంపొంది, యుద్ధసన్నద్ధుడనై రథంఎక్కి కురుక్షేత్రానికి వెళ్ళాను. పరశురాముడు అప్పటికే అక్కడికిచేరుకుని ఉన్నాడు. మా యుద్ధం చూడటానికి మునులందరూ ఒక పక్కగా నిలిచి ఉన్నారు. నేను పరశురాముడికి నమస్కారంచేసి యుద్ధం చెయ్యటానికి సిద్ధమయ్యాను. మేము ఒకరినొకరం స్పృహతప్పిపోయేటట్టు బాణాలతో కొట్టుకున్నాం. మా యుద్ధం ఇరవైనాలుగు రోజులు సాగింది. పరశురాముడు తాను ఓడిపోయినట్టు ఒప్పుకున్నాడు.

"తరవాత ఆయన అంబతో, 'చూశావు గదా,నేనుభీష్ముణ్ణి జయించలేకపోయాను. అందుచేత నీకు నేనేమీ చేయలేను. కావాలంటే, నీకై నువ్వే భీష్ముణ్ణి శరణు వేడు,' అన్నాడు. అంబ అలాచేయనిరాకరించి, నన్ను చంపటానికై తపస్సు చేసుకుంటానని వెళ్ళిపోయింది. పరశురాముడు మునులతో సహా మహేంద్ర పర్వతానికి వెళ్ళిపోయాడు. నేను అంబ వెంట కొందరు మనుషులను పంపి, ఆమె ఎక్కడికి పోతుందో, ఏం చేస్తుందో కనిపెట్టి నాకు తెలియజేయమన్నాను.

"అంబ యమునా తీరాన ఉండే ఋష్యాశ్రమాలకు వెళ్ళింది. అక్కడ ఆమె ఘోరమైన తపస్సు చేసింది. అలా ఆమె

పన్నెండేళ్ళపాటు తపస్సు చేసింది. బంధువులు మధ్యలో మానమని ఎంతగా చెప్పినా వినలేదు. కొంత కాలానికి ఆమెకు శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. ఆమె నన్ను జయించేటట్టు వరం కోరుకున్నది. శివుడామెకు ఆ వరం ఇచ్చాడు; వచ్చేజన్మలో స్త్రీగా పుట్టి, పురుషుడుగా మారి, నన్ను ఆమె యుద్ధంలో చంపేటట్టు శివుడు చెప్పి, అంతర్థానమయ్యాడు. ఆమె వెంటనే చితిపేర్చుకుని, 'భీష్మణ్ణి చంపటానికి అగ్ని ప్రవేశం చేస్తున్నాను,' అంటూ అగ్నిప్రవేశం చేసింది."



ఈ విషయాలు చెప్పి, భీష్ముడు దుర్యోధనుడికి శిఖండి వృత్తాంతం తెలిపాడు.

ద్రుపదుడి భార్యకు పిల్లలు కలగలేదు. ఆయన కూడా భీష్ముడి చేతిలో ఓడినవాడే కావడం చేత, భీష్మణ్ణి చంపే కొడుకు కోసం శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై, "భీష్మణ్ణి చంపగల స్త్రీపురుషుడు కలుగుతాడు," అని చెప్పాడు.

తరవాత ద్రుపదుడి భార్య గర్భవతి అయి, కాలక్రమాన ఒక ఆడపిల్లనుకన్నది. కాని ద్రుపదుడు తనకు కొడుకు కలిగినట్టు లోకానికి చాటాడు. తరవాత ఆయన ఈ రహస్యాన్ని చాలా శ్రద్ధగా కాపాడుతూ, ఆ పిల్లకు కొడుక్కు చేయవలిసిన కర్మలన్నీ చేశాడు. కూతురి రహస్యం దాచటంలో ద్రుపదుడి భార్య కూడా చాలా శ్రద్ధవహించింది. ద్రుపదుడికి ఒకటే ధైర్యం-శివుడి మాట ప్రకారం తన కూతురు కొడుకు అవుతుందని. ఆ పిల్లకు ఆయన శిఖండి అని నామకరణం చేశాడు.

శిఖండి చిత్రకళా, శిల్పమూ చక్కగా నేర్చుకున్నది. ఆమె మగవేషంతో ద్రోణుడి వద్దకు వెళ్ళి విలువిద్య అభ్యసించింది. కాలక్రమాన ఆమె యుక్తవయస్కురాలయింది. అది చూసి ద్రుపదుడు చాలా బెంగపడ్డాడు. శివుడు చెప్పినట్టు ఆమె ఇంకా పురుషుడుగా మారనేలేదు.

"శివుడి మాట ఎన్నటికీ అబద్ధం కాదు. మనం మన పిల్లకు తగిన కన్యను చూసి వివాహం చేసేద్దాం," అని ద్రుపదుడి భార్య అన్నది.

ద్రుపదుడు ఈ ఆలోచన ఆమోదించి దశార్ణరాజు కూతురిని శిఖండికి భార్యగా ఎన్నుకుని, వివిధ దేశాల రాజులకు ఆ



వార్త తెలిపాడు. దశార్ణరాజు హిరణ్య రోముడు చాలా బలవంతుడు. ఆయన కుమార్తె పేరు కూడా శిఖండే. ద్రుపదుడితో వియ్యమందటానికి ఆయన సంతోషించాడు. శిఖండులిద్దరకీ వివాహం జరిగింది.

కొంత కాలానికి దశార్ణరాజు కూతురు యౌవనవతి అయింది. ఆమెకు తన భర్త మగవాడు కాడనీ, ఆడది అనీ తెలిసింది. ఆమె సిగ్గుపడుతూ ఈ వార్త తన చెలికత్తెలకు చెప్పింది. వాళ్ళు ఈ రహస్యాన్ని దశార్ణరాజుకు అందజేశారు. దశార్ణరాజు ద్రుపదుడు చేసిన వంచనకు మండిపడి తన దూతను ద్రుపదుడి వద్దకు పంపాడు. దూత వచ్చి తన రాజు మాటలుగా ఇలా చెప్పాడు: "దుర్మార్గుడా, నీ కూతురికి నా కూతురిని పెళ్ళిచేసుకుని నన్ను అవమానించావు. నేను వచ్చి, నిన్నూ, నీ బంధు మిత్రులనూ చంపబోతున్నాను."

ద్రుపదుడి నోట మాటలేదు. ఆయన దశార్ణరాజుకు, 'నేను మిమ్మల్ని మోసగించలేదు," అని మాత్రం జవాబు పంపాడు. దశార్ణరాజు తృప్తిపడక, ద్రుపదుణ్ణి నిర్మూలించటానికి వస్తున్నట్టుగా, దూతద్వారా యుద్ధవార్త పంపాడు.

ద్రుపదుడు బెదిరిపోయి, ఇప్పుడు ఏం చెయ్యాలని తన భార్యను అడిగాడు. తన పరివారం వాళ్ళను మోసగించటానికి, తనే తన కూతురును కొడుకని ఇంతకాలమూ భ్రమపడినట్టు నటించాడు.

తన తల్లిదండ్రులకు కలిగిన కష్టం చూసి, శిఖండి ప్రాణత్యాగం చేయనిశ్చయించి, ఇల్లు విడిచి కీకారణ్యాలకు వెళ్ళిపోయింది. ఆ అరణ్యం స్థూణాకర్ణుడనే యక్షుడి పాలనలో ఉన్నది. శిఖండి ఆ వనంలో కొన్ని రోజులు ఉపవాసాలు చేసిన మీదట యక్షుడు ఆమెను చూసి, "నువ్వు ఇక్కడ ఎందుకున్నావు? నీకు ఏంకావాలి? సహాయం చేస్తాను," అన్నాడు.

"నాకు సహాయం చెయ్యటం నీ తరం కాదు," అన్నది శిఖండి.

"నేను కుబేరుడి మిత్రుణ్ణి, నువ్వు కోరినవరం ఇవ్వగలను," అన్నాడు యక్షుడు. తాను మగవాడుగా పెరిగి, ఆడపిల్లను పెళ్ళాడటమూ, అందువల్ల తన తండ్రికి వచ్చిన విపత్తూగురించి శిఖండి యక్షుడికి తెలిపింది.

'నేను నీకు కొంతకాలం పాటు నా పురుషత్వం ఇచ్చి, నీ స్త్రీత్వం నేను తీసు

కుంటాను. మీ తండ్రికి కలిగిన ఆపద గడవగానే మళ్ళీ నాపురుషత్వం నాకిచ్చి నీ స్త్రీత్వం నువ్వు తీసుకో," అన్నాడు యక్షుడు.

శిఖండి పరమానందం చెంది, అలాగే చేస్తానన్నది.

ఆడదిగా వెళ్ళిన శిఖండి మగవాడుగా తిరిగి వచ్చేసరికి ఆమె తల్లిదండ్రులు అపరిమితమైన ఆనందం పొందారు. "నా కొడుకు మగవాడే. కావలిస్తే వచ్చి చూసుకోవచ్చు," అని ద్రుపదుడు దశార్ణరాజుకు కబురు పంపాడు. దశార్ణరాజు ఈ మాట నిజమో కాదో తెలుసుకునేటందుకు కొందరు స్త్రీలను పంపాడు. వాళ్ళు శిఖండిని అనేక విధాల పరీక్షించి, తిరిగి వెళ్ళి, శిఖండి పురుషుడేనని దశార్ణరాజుకు తెలిపారు. దశార్ణరాజు స్వయంగా వచ్చి, ద్రుపదుడి మీదా, శిఖండి మీదా చాలా గౌరవం ప్రదర్శించి, తనకు అబద్ధం చెప్పిన కుమార్తెను కోప్పడి, తిరిగివెళ్ళాడు.

ఈలోపల కుబేరుడు విమానం మీద తిరుగుతూ స్థూణాకర్ణుడుండే వనానికి వచ్చి, స్థూణాకర్ణుడు తనను చూడరానందుకు ఆశ్చర్యపడ్డాడు. యక్షుణ్ణి తీసుకురావటానికి వెళ్ళిన కుబేరుడి దూతలు ఆడదిగా ఉన్న స్థూణాకర్ణుణ్ణి కుబేరుడి వద్దకు తెచ్చారు. యక్షుడు స్త్రీ అయిపోవటానికి కారణం విని, కుబేరుడు ఆగ్రహించి, "ఎప్పటికీ ఆడదిగానే ఉండిపో!" అని శపించాడు. మిగిలిన వాళ్ళంతా శాపాంతం చెప్పమని ప్రాథేయపడిన మీదట కుబేరుడు శిఖండి చనిపోయిన అనంతరం యక్షుడికి మగతనం తిరిగివచ్చేటట్టు అనుగ్రహించాడు.

తరవాత శిఖండి యక్షుడి వద్దకు వచ్చి, "అయ్యా, మా ఆపద తప్పింది. ఇక మీ పురుషత్వం మీరు తీసుకోండి," అన్నాడు. యక్షుడు తనను కుబేరుడు శపించాడనీ పురుషత్వాన్ని శిఖండి జీవితాంతం ఉంచుకోవచ్చుననీ చెప్పి, పంపేశాడు.

భీష్ముడు ఈ విధంగా శిఖండి వృత్తాంతం చెప్పి, "అంబ శిఖండిగా పుట్టింది. ఆడదిగా పుట్టిన వాళ్ళనూ, ఆడ పేరుగల వాళ్ళనూ ఆడవేషంలో తిరిగే వాళ్ళనూ చంపనని నా వ్రతం. అందుకే శిఖండితో యుద్ధం చెయ్యను, శిఖండిని చంపనని అన్నాను," అన్నాడు.





# నిజమైన గెలుపు

నిరంజనవరం ఊరిచివరవున్న చెరువు గట్టున, ఒక సాయంకాలం నలుగురు స్నేహితులు కలిసి మాట్లాడుకోసాగారు. మాటలసందర్భంలో భూషణంఅనేవాడు, "ప్రపంచంలో మనిషికి అసాధ్యమైనది ఏదీలేదు. పట్టుబట్టి ప్రయత్నించాలే కానీ, ఎంతటి కష్టసాధ్యమైన పనైనా సాధించ వచ్చు," అన్నాడు.

దానికి దయానిధి అనేవాడు, "ఏదైనా సాధించవచ్చా?" అని అడిగాడు.

భూషణం నవ్వి, "అలాగని చెంబులో ఏనుగును పెట్టేలాంటి పనికాదు. మనిషికి ఆచరణ సాధ్యమైన పని ఏదైనా ప్రయత్నం మీద సాధించవచ్చు," అన్నాడు.

ఆ మాట పైన భూషణానికీ, మిత్రులకూ చాలాసేపు వాగ్వివాదం జరిగింది. మాటామాటా పెరిగింది. పంతం హెచ్చి పందాలవరకూ పోయింది. చివరకు దయానిధి, "ఒరే, భూషణం! ఇంత వాదిస్తున్నావు కదా! నేనొక పని చెబుతాను. దాన్ని సాధిస్తావా?" అన్నాడు.

"అదేమిటో చెప్పు!" అన్నాడు భూషణం.

"నువ్వు, నీ తండ్రిచేత చుట్టతాగడం మాన్పించాలి. వంద వరహాలు పందెం!" అన్నాడు దయానిధి.

భూషణం తండ్రి మాధవయ్య మంచి మాటకారి, చతురుడు. మనిషి చాలా మంచివాడు. అయితే, అతనికున్న దురలవాటు చుట్టతాగడం. ఎవరైనా మాటల్లోకి దించారంటే చాలు, రొంటినవున్న పొగాకు మట్టతీసి, చుట్టచుట్టి, ఒకటితర్వాత ఒకటి వరసగా కాల్చిపారేస్తూనేవుంటాడు.

భూషణం కొంతసేపు మౌనంగా వుండి, తర్వాత దయానిధితో, "దయానిధీ! నా చదువూ, నా తెలివితేటలూ అన్నీ ఉపయోగించి, నేనీపని సాధిస్తాను. కానీ, నీ వంద వరహాల పందానికి ఆశపడిమాత్రం కాదు," అన్నాడు.

దాసరి వెంకటరమణ

మర్నాడు, భూషణం చాలా ముఖ్యమైన విషయం మాట్లాడాలని తండ్రిని కూర్చో బెట్టి, చుట్టతాగడం వలన కలిగే నష్టాలన్నీ పూసగుచ్చినట్లు వివరించాడు. ఒక్కొక్క చుట్ట తాగడం మూలాన, ఒక్కరోజు ఆయువు తగ్గిపోతుందనీ, ఈ లెక్కన చాలాకాలం బతకడం అసంభవం అనీ- ఇంకా చాలా విషయాలు చెప్పాడు.

కొడుకు చెప్పినదంతా ఓపికగా విన్న మాధవయ్య, "చూడూ, చావుపుట్టుకలు మన చేతుల్లో లేవు. చావు ఎప్పుడని రాసి పెట్టివుంటుందో అప్పుడే వస్తుంది. చుట్ట అంటే ఏవగించుకునేవాళ్ళు మాత్రం తొందరగా చనిపోవడం లేదా? చుట్ట తాగడం ఆరోగ్యానికి మంచిదికాదు. కానీ, చుట్టతాగడం, ఈ ప్రపంచంలో నాకున్న ఏకైక గొప్ప ఆనందం. ఆ ఆనందాన్ని దూరం చేసుకుని నిస్సారంగా ఎంతకాలం బతికి మాత్రం ఏం ప్రయోజనం? నన్నిలా వదిలెయ్యి!" అంటూ చుట్ట వెలిగించు కుని, అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాడు.

భూషణం దిగాలు పడిపోయాడు. అయినా తన ప్రయత్నం మానలేదు. ఒక రోజు తనతో ఏదో చెప్పబోతున్న కొడుకుతో మాధవయ్య, "ఒరే, భూషణం! చుట్ట కాల్చడం, నాకు ఊపిరిపీల్చడం అంత ముఖ్యమైనది. ఆ అలవాటు నేను పోయిన రోజే పోవాలి!" అన్నాడు.

"నువ్వు చుట్టతాగడం మానేస్తే, లక్ష వరహాలిస్తామని ఎవరైనా అంటే, మానే స్తావా?" అని అడిగాడు భూషణం.



"తప్పకుండా మానేస్తాను," అన్నాడు మాధవయ్య.

"అంటే, నువ్వు మానుకోవాలి అను కుంటే, చుట్టతాగడం మానుకోగలవన్న మాట, ఔనా?" అని అడిగాడు భూషణం.

మాధవయ్య నవ్వి, "నీ తృప్తికోసం అలా అన్నాను గానీ, నిజంగా నేను చుట్ట మానేస్తే లక్షవరహాలిచ్చే సన్యాసి ఎవ డుంటాడు గనక!?" అన్నాడు.

"ఎవడైనా నీ దగ్గిరకు వచ్చి, పదునైన కత్తి ఒకటి నీగొంతుకు ఆనించి, నువ్వు చుట్టకాల్చడం మానేస్తావా లేదా! లేకుంటే చంపేస్తాను, అంటే ఏమంటావు?" అన్నాడు భూషణం.

"మానేస్తాననే అంటాను," అన్నాడు మాధవయ్య.

"చూశావా? నువ్వు అనుకుంటే మాను కోగలవు!" అన్నాడు భూషణం ఉత్సాహంగా.

"కానీ, ఆ వెధవ అలా కత్తి గొంతుకు పెట్టి ఎంత సేపుంటాడు? వాడు అలావెళ్ళ గానే, ఇలా చుట్టవెలిగిస్తాను," అంటూ, మాధవయ్య చుట్ట వెలిగించి, తాపీగా ఆనందంగా పొగపీల్చసాగాడు.

భూషణానికి బాగా కోపం వచ్చింది. వాడు గొంతు పెద్దదిచేసి, "నాన్నా! నేను చాలా బాధతో మాట్లాడుతున్నాను. దాన్ని నువ్వు హాస్యంగా తీసుకుని తేలిగ్గా కొట్టేస్తున్నావు. నేను ఆఖరిగా చెబుతు న్నాను. నువ్వు చుట్టతాగడం మానకపోతే, నేను ఎంతకైనా తెగిస్తాను," అంటూ వెళ్ళి పోయాడు.

భూషణం ఆ రోజంతా భోజనం చెయ్య లేదు. తల్లి విమలమ్మ ఎంత బ్రతిమిలా డినా వినలేదు. ఆ సంగతి ఆమె మాధ వయ్యకు చెబితే, "బాగా ఆకలైతే వాడే తింటాడులే!" అనేశాడు.

ఆ మర్నాడు, మాధవయ్య పనిమీద పొరుగూరు వెళ్ళి, రెండురోజుల తర్వాత తిరిగివచ్చాడు. భూషణం పరిస్థితి చాలా దిగజారుడుగా వుంది. కళ్ళు లోతుకు పోయి, ముఖం కళ తప్పింది. విషయం తెలిసిన ఇరుగుపొరుగు భూషణాన్ని పరా మర్శించవచ్చి, మాధవయ్యను తలా ఒక మాటా అనసాగారు. వాళ్ళంటున్న మాట లకన్న, ఏమీ అనని భార్య ముఖంలోని నిరసనకన్న; భూషణం పట్టుదల, దాని వెనకదాగివున్న తనపైని అచంచలమైన ప్రేమ, మాధవయ్యను ఎంతగానో కది లించింది.

ఆయన రొండినవున్న పొగాకు మట్టనూ, ఇంట్లో గోతాంలో పెట్టివున్న పొగాకునూ తీసుకుపోయి వీధిలోపారేసి, భూషణాన్ని దగ్గరకు తీసుకుని, "నువ్వేగెలిచావు! ఇక వెళ్ళి భోజనం చెయ్యి," అన్నాడు.

భూషణం, తండ్రి వంకచూస్తూ, "కాదు, గెలుపు నాది కాదు. ఇంతవరకూ నిన్ను వశపరుచుకుని బానిసను చేసుకున్న, నీ దృష్టిలో అత్యంత ఆనందాన్ని కలిగించే చుట్టను జయించిన నీదే, నిజమైన గెలుపు!" అన్నాడు.





# జడబుద్ధి

కావేరీ తీరాన ఒక అగ్రహారంలో గోవర్ధను డనే బీదవాడుండేవాడు. ఆయనకు లేక లేక ఒక కొడుకు కలిగాడు. తల్లిదండ్రులా కుర్రవాడికి శ్రీవర్ధనుడని పేరు పెట్టి, గారా బంగా పెంచసాగారు.

చిన్నప్పటినుంచీ శ్రీవర్ధనుడు మంద మతిగానే ఉండేవాడు. ఉన్నచోటనే ఎంత సేపైనా ఉండిపోయేవాడు. ఎవరన్నా లేవ మంటేగాని లేచేవాడుకాడు. రమ్మంటే వచ్చేవాడు, పొమ్మంటే పోయేవాడు. భోజనం చెయ్యమని ఎవరో ఒకరు చెబి తేనేగాని భోజనం కూడా చేసేవాడు కాడు. చివరకు వాడు పడుకోవాలన్నా ఎవరో ఒకరు, "పడుకో," అని చెప్పాలి.

చదవేస్తే ఈ మందకొడితనం కాస్త తగ్గుతుందని, తండ్రి శ్రీవర్ధనుణ్ణి గురు కులానికి పంపేశాడు. పన్నెండేళ్ళపాటు ఆ కుర్రవాడు గురువుగారి దగ్గిర ఉండి కూడా కొంచెమైనా మారలేదు. కాని గురువుగారు చెప్పినదల్లా చేసేవాడు. గురువుగారు చదవమంటే చదివేవాడు, ఫలానాపని చెయ్యి అంటే ఆ పని చేసేవాడు. వాడి బుద్ధికి చలనం లేదన్నమాటే గాని వాడు సోమరిపోతుకాడు. అందుచేత చెప్పిన ఏ పని అయినా శ్రీవర్ధనుడు చక్క గానే చేసేవాడు. పన్నెండేళ్ళపాటు వాడి చేత అర్థమైనపనులన్నీచేయించుకోవటం చేత గురువుకు వాడంటే చాలా ఇష్టంగా ఉండేది. పన్నెండేళ్ళు పూర్తిఅయ్యాక గురువు గారు, "ఇక వెళ్ళు, నాదగ్గిర చేసినట్టే చెప్పిన పనులు శ్రద్ధగా చేస్తూ అభివృద్ధిలోకిరా!" అని దీవించి శ్రీవర్ధనుణ్ణి ఇంటికి పంపేశాడు.

పన్నెండేళ్ళు గురుశుశ్రూషచేసి వచ్చినా, తన కొడుకులో కొంచెమైనా మార్పు లేక పోవటం చూసి తండ్రి, శ్రీవర్ధనుడి చేత ఇంటి పనులు చేయించాడు. శ్రీవర్ధనుడి తల్లికి కంటిచూపుపోయింది. అతని తండ్రే వంట దగ్గిరనుంచీ చేసుకుంటున్నాడు.



కొడుక్కు ప్రతి చిన్నపనీ చెప్పి చేయించు కోవటం ఆయనకు చాలా విసుగనిపించింది. ఈడొచ్చిన తనకొడుక్కు పెళ్ళిచేసేస్తే ఆ వచ్చే పెళ్ళామే వాడికి పనులు చెప్పి చేయించుకుంటుంది, తనకు పూటపూటా చెయ్యి కాల్చుకునే పనీ తప్పు తుందనుకుని, గోవర్ధనుడు తన కొడుక్కు ఒక బుద్ధి మంతురాలైన పిల్లనుచూసి పెళ్ళి చేసేశాడు.

భార్య కాపరానికి వచ్చాక శ్రీవర్ధనుడికి బొత్తిగా పనిలేకుండా పోయింది. శ్రీవర్ధనుడి భార్యతో మామగారు, "నీ మొగుడికి పనులు చెప్పి చేయించుకో," అని అన్నాడే గాని, భర్తకు పనులు చెప్పటానికా పిల్ల సందేహించింది.

తన కొడుకు అస్తమానమూ చట్రాయిలా కూర్చుని ఉండటం చూసి తండ్రి, "నీ భార్య ఏమన్నా చెయ్యమంటుందేమో, కనుక్కొని పనులు చేసిపెట్టరా," అని శ్రీవర్ధనుణ్ణి హెచ్చరించాడు.

"పెద్దవాళ్ళు పనులు చెప్పాలి, చిన్న వాళ్ళు చెయ్యాలి. ఏమన్నా పని చెబుతారేమో అత్తయ్యనడగండి," అన్నది భార్య.

శ్రీవర్ధనుడుతల్లిదగ్గరికిపోయి, "ఏమన్నా పని ఉంటే చెప్పమ్మా, చేస్తాను," అన్నాడు.

"గుడ్డిదాన్ని నాకేం తెలుస్తుందిరా. మీ నాన్నను అడుగు," అన్నది తల్లి.

"నా భార్యా, అమ్మా ఏమీ పనులు చెప్పటంలేదు. ఏంపని చెయ్యమంటావో నువ్వే చెప్పు," అన్నాడు శ్రీవర్ధనుడు తండ్రితో.

"నా కర్మకొద్దీ పుట్టుకొచ్చావు! నేను నీకేంపని చెప్పేది? వెళ్ళి దేవుణ్ణి గురించి తపస్సు చెయ్యి. దేవుడనుగ్రహిస్తే ఏదైనా వరమన్నా ఇస్తాడు," అన్నాడు తండ్రి ప్రాణం విసిగి.

శ్రీవర్ధనుడు అడవికి పోయి తపస్సు ప్రారంభించాడు. కొంతకాలానికి దేవుడు ప్రత్యక్షమై, "నీ తపస్సుకు మెచ్చాను. ఏం వరం కోరుతావో కోరుకో," అన్నాడు.

"ఏంవరం కోరుకోమంటారో మా ఇంట్లో వాళ్ళను అడిగివస్తాను. నువ్విక్కడే ఉండు, దేవుడూ!" అంటూ శ్రీవర్ధనుడు పరమానందంతో ఇంటికి వెళ్ళి, తండ్రితో, "నువ్వు చెప్పినట్టే తపస్సు చేశాను. దేవుడు కనిపించి వరం కోరుకోమన్నాడు. ఏంవరం కోరుకోమంటావు?" అన్నాడు.

"ఇంత ఐశ్వర్యం కావాలని కోరుకోక పోయావా? చిన్నప్పటి నుంచీ దరిద్రపు

బతుకేగదా మనది? ఆ మాత్రం కూడా తెలీదా?" అన్నాడు తండ్రి.

ఇంతలో తల్లి, కొడుకు అన్న మాటలు విని, "నాయనా, నాకు కళ్ళురావాలని దేవుణ్ణి అడగరా," అన్నది.

తరవాత భార్య అతన్ని అవతలికి పిలిచి, "మనకు పిల్లలు కలగాలని కోరండి," అని చెప్పింది.

అందరితోనూ, "అలాగే, అలాగే," అని చెప్పి శ్రీవర్ధనుడు తాను తపస్సు చేసిన చోటికి పరిగెత్తుకు వచ్చాడు. కాని అక్కడ దేవుడు కనిపించలేదు. దేవుడికోసం వెతుకుతూ అతను అడవి అంతా కలయ దిరుగుతూ, ఒకచోట తపస్సు చేసుకునే మునిని చూసి, "అయ్యా, ఇంతకు ముందు నాకు ప్రత్యక్షమైన దేవుడు ఇటుగా గాని వచ్చాడా?" అని అడిగాడు.

ఆ మాటకు ముని ఆశ్చర్యపడి శ్రీవర్ధనుణ్ణి వివరాలడిగాడు. అంతా విని ఆ ముని, "దేవుడు ప్రత్యక్షమైతే ఏదో వరం అడగక, ఆ దేవుణ్ణి ఉండమని నువ్వు ఇంటికి వెళ్ళి వచ్చావా? ఎక్కడైనా పడి చావలేకపోయావూ?" అన్నాడు, దేవుణ్ణి ప్రత్యక్షం చేసుకున్నాడన్న అసూయకొద్దీ. శ్రీవర్ధనుడు ముని చెప్పిన ప్రకారం ఎక్కడైనా పడిచావడానికి నిశ్చయించి చుట్టూ చూస్తే కొంతదూరంలో నిటారుగా ఉన్న ఒక కొండ కనిపించింది. దానిపై నుంచి పడి చద్దామనుకుని శ్రీవర్ధనుడు ఆ కొండ మీదికి ఎక్కసాగాడు. మధ్య ప్రాంతంలో ఒక కోయవాడు కనిపించి, "కొండపైన ఏమీ లేదే, ఎందుకెక్కుతున్నావు?" అని అడిగాడు.

"పైనుంచి కిందకు దూకి చావటానికి," అంటూ శ్రీవర్ధనుడు కోయవాడితో కథ అంతా సవిస్తరంగా చెప్పాడు.

కోయవాడు అంతా విని, "ఏం మనిషివయ్యా? నిన్ను దేవుడు వరం కోరుకోమన్నాడు గాని, దాన్ని తనతో చెప్పమన్నాడా? నువ్వు చెప్పకపోతే దేవుడికి నీ కోరిక తెలీదా? వెళ్ళు, ఇంటికి వెళ్ళు. మీ అందరి కోరికలూ దేవుడే తీరుస్తాడు," అన్నాడు.

కోయవాడు చెప్పిన ప్రకారం జడబుద్ధి అయిన శ్రీవర్ధనుడు ఇంటికి తిరిగి వచ్చాడు. ఇల్లంతా సమస్త సంపదలతో కళకళలాడుతున్నది. తల్లికి చూపు కూడా వచ్చేసింది. శ్రీవర్ధనుడు చాలా సంతోషించాడు. మరొక ఏడాది తిరిగేసరికి అతని భార్య బిడ్డతల్లి కూడా అయింది.





# అతి సులభమైన సమాధానం!

ఒకానొకప్పుడు పరమ పిసినారీ, స్వార్థప రుడూ అయిన ఒక వర్తకుడు ఉండేవాడు. ఒకనాడు వ్యాపార నిమిత్తం అతడు దూరంలో ఉన్న పట్టణానికి వెళ్ళవలసి వచ్చింది. తన వెంటరావడానికి యూసఫ్ అనే యువకుణ్ణి సేవకుడిగా కుదుర్చుకున్నాడు. పనిలో చేరడా నికి ముందు యూసఫ్, "ప్రభూ! ఇంతదూరం ప్రయాణ శ్రమను తట్టుకోలేనేమో!" అన్నాడు అనుమానంగా.

"అది సమస్యేకాదు. నీ శ్రమలో సగం నేను పంచుకుంటాను!" అన్నాడు వర్తకుడు.

చిన్నబండిలో సరుకులు నింపి, దానికి గుర్రాన్ని కట్టి, వర్తకుడు గుర్రం మీద బయలు దేరాడు. యూసఫ్ గుర్రం ముందు పరిగెత్త సాగాడు. ఆ రోజంతా వర్తకుడు యూసఫ్‌కు కొద్ది సేపు కూడా గుర్రంమీద వచ్చే అవకాశం ఇవ్వలేదు.

సాయంకాలం నిర్ణీతప్రాంతాన్ని చేరుకోగానే, ఆ రాత్రికి అక్కడే బసచేయాలనుకుని వర్త కుడు బండిని ఆపాడు. గుడారం ఏర్పాటు చేసుకున్నాడు. వెంటతెచ్చుకున్న రొట్టెలు ఇద్దరూ తిన్నాక వర్తకుడు, "యూసఫ్! నువ్వు గుర్రానికి కాపలావుండు!" అన్నాడు.

"ప్రభూ! పగలంతా పరిగెత్తడం వల్ల చాలా అలిసిపోయాను. తమరు నా శ్రమలో సగం పంచుకుంటానన్నారు. అర్ధరాత్రి వరకు నేను నిద్రపోతాను. అంతవరకు తమరు కాపలా వుంటే బావుంటుందేమో," అన్నాడు యూసఫ్ వినయంగా.

"అలాకాదు, యూసఫ్! నీ శ్రమను ఇంకో విధంగా పంచుకుంటాను. ఒకే సమయంలో సరుకులూ, గుర్రం రెండింటినీ కాపలా కాయడం అంటే నీకు శ్రమతో కూడుకున్న పనేకదా! నువ్వు బయట కూర్చుని గుర్రాన్ని మాత్రం కాపలాకాయి! నేను గుడారం లోపలి సరుకులకు కాపలా వుంటాను," అంటూ గుడారం లోపలికి వెళ్ళి పడుకున్నాడు, వర్తకుడు.

యూసఫ్ మౌనంగా గుడారం ముందు ఒక చెట్టు బోదెకు ఆనుకుని కూర్చున్నాడు. బాగాఅలిసిపోయివుండడంవల్ల నిద్రమత్తుతో కనురెప్పలు మూతలు పడసాగాయి.

అర్ధరాత్రి సమయంలో ఉన్నట్టుండి, "యూసఫ్, ఏంచేస్తున్నావు?" అని అడిగాడు వర్తకుడు సగం నిద్రమత్తులో.

"ఆలోచిస్తున్నాను, ప్రభూ!" అన్నాడు యూసఫ్ సమయోచిత బుద్ధితో.

ఆఫ్ఘనిస్తాన్ కథ

"దేనిని గురించి ఆలోచిస్తున్నావు?" అని అడిగాడు వర్తకుడు.

"గులాబీలకోసం వెళితే, అక్కడ ముళ్ళు మాత్రమే కనిపిస్తే ఏం చేయాలా? అని ఆలోచిస్తున్నాను," అన్నాడు యూసఫ్.

"ముళ్ళను ముట్టుకోకుండా వచ్చిన దారిన తిరిగి వెళ్ళిపోవడమే!" అని చెప్పి, యూసఫ్ మెలకువతో ఉన్నాడన్న తృప్తితో మళ్ళీ నిద్రకు ఉపక్రమించాడు వర్తకుడు.

రెండుగంటలుగడిచాయి. వర్తకుడు మళ్ళీ, "యూసఫ్! ఇప్పుడు దేన్నిగురించి ఆలోచిస్తు న్నావు?" అని అడిగాడు వర్తకుడు.

"ఒక వేళ రేపు సూర్యుడు ఉదయించక పోతే ఏం చేయాలా అని గాఢంగా ఆలోచిస్తు న్నాను, ప్రభూ!" అన్నాడు యూసఫ్.

"దిగులు పడనవసరమే లేదు. ఇక్కడే సూర్యుడి కోసం కూర్చోకుండా తెల్లవారు జామునే వెళ్ళిపోవచ్చు!" అంటూ వర్తకుడు మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు.

మరికొంత సేపటికి తెల్లవారసాగింది. గుడారం లోపలినుంచి వర్తకుడు, "యూసఫ్! నిద్రపోయావా? ఇంకా ఏదైనా ఆలోచిస్తు న్నావా?" అని అడిగాడు.

"మరీ తీవ్రంగా ఆలోచిస్తున్నాను, ప్రభూ!" అన్నాడు యూసఫ్.

విశ్వాసపాత్రుడైన సేవకుడు తెల్లవార్లూ నిద్రపోకుండా గుర్రాన్ని కాపలా కాస్తున్నందుకు వర్తకుడికి పరమసంతోషం కలిగింది. "ఇప్పుడు దేన్ని గురించి ఆలోచిస్తున్నావు?" అని అడిగాడు.

"అవును, ప్రభూ! సమాధానం దొరక్క బుర్రబద్దలయ్యేలా ఆలోచిస్తున్నాను. నిన్న పొద్దంతా మీరు గుర్రం మీదవచ్చారు. నేను గుర్రంముందు పరిగెడుతూవచ్చాను. ఈ రోజు గుర్రం లేదంటే, ఎవరు గుర్రం మీద వెళ్ళాలి? గుర్రం ముందు ఎవరు పరిగెత్తాలి? నాకుతోచడం లేదు. మీరే చెప్పండి," అన్నాడు యూసఫ్ మెల్లగా.

"సమాధానం చాలా సులభం! ఇద్దరం కలిసి నడిచే వెళదాం!" అన్నాడు వర్తకుడు. మరుక్షణమే యూసఫ్ మాటల్లోని భావం స్ఫురించగానే, వర్తకుడు బాణంలా గుడారం వెలుపలికి దూకాడు. గుర్రం కనిపించలేదు. చుట్టుపక్కల తిరిగిచూశాడు. గుర్రం జాడ ఎక్కడా కనిపించలేదు. తన దురదృష్టానికి వాపోతూ రెండు చేతులలో తలపట్టుకుని కూర్చున్నాడు.

తాను మొదట చెప్పినట్టు సేవకుడి శ్రమలో పాలు పంచుకుని, వాణ్ణి అర్ధరాత్రి వరకు నిద్రపోనిచ్చి, తాను కాపలా కాచి వున్నట్టయితే, తన మేలుజాతి గుర్రం అంత సులభంగా దొంగలపాలయ్యేది కాదు, అని వర్తకుడు గ్రహించాడు. ఆ రోజు నుంచి అతని ప్రవర్తనలో వచ్చిన మార్పునుచూసి అందరూ ఆశ్చర్యపోయారు.



చందమామ




# మీకు తెలుసా? చెప్పుకోండి చూద్దాం!

ఈ సంచికలోని ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. ఈ లోగా వాటి సమాధానాలు తెలుసుకోవడానికి ప్రయత్నించి చూడండి.



## 1

ప్రతినిత్యం అసంఖ్యాకులైన మానవులు యమలోకానికి వెళుతూనే ఉన్నారు. దానిని చూస్తూన్నప్పటికీ, బతికి వున్న వారు ఎప్పటికీ మరణం లేని వారిలా ప్రవర్తిస్తున్నారు. దీనికి మించిన వింత మరేది ఉంటుంది?

ఈ మాట అన్న వారెవరు? ఎప్పుడు? ఎందుకు?

## 2

కింద కనబరచిన పురాణ పాత్రలకూ, ప్రాంతాలకూ ఉన్న సంబంధం ఏమిటో తెలుసా?

ఎ. శకుని - గాంధార
బి. కేసరి - మహామేరు
సి. సహదేవుడు - మాహిష్మతి
డి. భరతుడు - కేకయ
ఇ. వాల్మీకి - తమసా





విజ్ఞాన వినోదాల మేలు కలయిక,
దేశ భాషలలో చందమామ ప్రత్యేకత!

# అలవాటు !

**తు**మ్మలచెరువు గ్రామంలో సంత జరుగుతున్నది. సిద్ధప్ప అనేవాడు, ఒక ఆవును అమ్మజూపుతూ, "చాలా మేలైన జాతి ఆవు. ఆ మాట నేను చెప్పనవసరంలేదు. మీకు చూస్తూంటే తెలుస్తున్నది గదా!" అంటున్నాడు.

బంగారయ్య పొరుగూరువాడు. అతడు సంతలో తిరిగి కాలక్షేపం చేద్దామని వచ్చాడు. అయినా, సిద్ధప్ప, ఆవు ఖరీదు ఎంత చెపుతాడో కనుక్కుందామని, దాన్ని ఎంతకు అమ్మజూస్తున్నావని, అడిగాడు.

"వంద రూపాయలు!" అన్నాడు సిద్ధప్ప.

"పాతికరూపాయలకిస్తావా?" అని అడిగాడు బంగారయ్య, అంత తక్కువ ధరకు, దానిసొంతదారుడమ్మడన్న ధీమాతో.

సిద్ధప్ప, బంగారయ్యకేసి ఎగాదిగా చూసి, "సరే, ఆ ధరకే తీసుకో!" అన్నాడు.

బంగారయ్య ఆశ్చర్యపోయాడు. ఎంతలేదన్నా, ఆ ఆవు వందరూపాయలకు ఎక్కువే చేస్తుంది. అతడు, పాతిక రూపాయలు సిద్ధప్పచేతిలో పెట్టి, "నిజానికి నేనడిగింది చాలా తక్కువ ధర. అంత తక్కువకు అమ్మవలసిన అవసరం ఏం కలిగింది?" అని ప్రశ్నించాడు కుతూహలంగా.

సిద్ధప్ప, బంగారయ్య యిచ్చిన పాతికరూపాయిలూ జేబులో పెట్టుకుని, "నాది కానిది అమ్మేటప్పుడు ధరవిషయం అసలు పట్టించుకోను, అది నా అలవాటు!" అంటూ వడివడిగా జనంలో కలిసిపోయాడు.

ఆ జవాబు విన్న బంగారయ్య బిత్తరపోయి, ఆవును అక్కడే వదిలి, మరొకదిశగా పరిగెత్తి, జనం మధ్యకు వెళ్ళిపోయాడు. — ఎన్. శివనాగేశ్వరరావు





# భారతదేశం

నాడు-నేడు






మనదేశంలో పురాణ సంబంధం కలిగిన నగరాలలో ముఖ్యమైనది గుజరాత్‌లోని ద్వారక. ఈ నగరాన్ని సాక్షాత్తు శ్రీకృష్ణుడే నిర్మించాడని పురాణాలు పేర్కొంటున్నాయి. ఈ నగరానికి ద్వారావతి, కుశస్థలి అనే పురాతన నామాలున్నాయి. పశ్చిమ సముద్ర తీరంలోని కృష్ణుడి రాజధానికి మరింత ప్రదేశం కావలసి రాగానే, సముద్రం లోపలికి వెళ్ళి కృష్ణుడికి కావలసిన భూభాగాన్ని ఇచ్చిందట. శ్రీకృష్ణ నిర్యాణం తరవాత ఆ స్థలాన్ని సముద్రం మళ్ళీ ఆక్రమించిందట.అంటే ద్వారకలో కొంతభాగం సముద్రంలో మునిగిపోయిందన్నమాట. శ్రీకృష్ణుడి కోటలో వున్న 'వేట్ ద్వారక' అనే స్థలం మాత్రం సముద్రం ముంపుకు గురికాలేదు. అదొక దీవిగా ఉంటున్నది.

వేట్ ద్వారక సమీపంలో జరిపిన తవ్వకాలు–శతాబ్దాలకు పూర్వం అక్కడొక సంపన్న నగరం ఉండేదని స్పష్టంగా నిరూపించాయి. ప్రస్తుతం ఉన్న ద్వారకను అంతకు పూర్వం వెలసిన ఐదు పట్టణాల శిథిలాల పై నిర్మించబడిన ఆరవ పట్టణం అని చెబుతారు.పురాణాల ప్రకారం ఇది శ్రీకృష్ణుడికాలం కన్నా ప్రాచీనమైనది. భారతదేశంలోని పవిత్ర నగరాలలో ద్వారక ఒకటి అని మన సంప్రదాయం చెబుతుంది. అయోధ్య, వారణాసి మధుర, ఉజ్జయని, హరిద్వార్, కాంచీపురం మిగిలిన ఆరు పవిత్ర నగరాలు.

అద్వైత వేదాంత మతస్థాపకుడైన ఆది శంకరాచార్యులు భారతదేశంలో నాలుగు దిశలా నాలుగు మఠాలను స్థాపించారు. ఉత్తరదిశలో బదరికాశ్రమంలో; దక్షిణాదిలో శృంగేరిలో; తూర్పు దిశలో పూరీ క్షేత్రంలో; తూర్పు దిక్కున ద్వారకలో తన

మఠాలను స్థాపించారు. నగరంలో ప్రధాన క్షేత్రమైన ద్వారకాధీశ్ ఆలయానికి పక్కనే శంకరమఠం ఉన్నది. ద్వారకాధీశ్ ఆలయంలో ద్వారకా నగర అధిపతి అయిన శ్రీకృష్ణుడి విగ్రహం ప్రతిష్ఠించబడి ఉన్నది.

గోమతీ నదీతీరంలో వెలసిన ఈ ఆలయాన్ని ప్రప్రథమంగా శ్రీకృష్ణుడి మునిమనమడైన వజ్రనాభుడు నిర్మించాడు. ప్రస్తుతం వున్న అందమైన దేవాలయాన్ని రాజా జగత్ సింగ్ రాథోడ్ నిర్మించాడు. రోజూ వేలాది మంది భక్తులు ఆలయాన్ని సందర్శిస్తారు. శ్రీకృష్ణుడి రాజప్రాసాదం బెట్ ద్వారకలో ఉన్నప్పుడు – ఆయన ఇప్పుడు ఆలయం వున్న ప్రదేశం నుంచే రాజ్యపాలనా వ్యవహారాలు చూసేవాడని చెబుతారు.

ఆలయంలోని శ్రీకృష్ణ విగ్రహం మనోహరంగా ఉన్నది. 1546వ సం॥లో మేవార్ (చిత్తోడ్‌గఢ్) రాణీ, పరమభక్తురాలూ అయిన మీరాబాయి ఈ విగ్రహంలో లీనమైపోయిందని చెబుతారు.

ఆలయానికి దక్షిణ దిశగా గోమతీనది ప్రవహిస్తున్నది. ఆలయం నుంచి 56 మెట్లు దిగి వెళ్ళినట్టయితే, నదిని చేరుకోవచ్చు. ఈ నది, అంతర్వాహినిగా పవిత్ర గంగానదితో కలిసిఉన్నదని ఒక విశ్వాసం!

ఈ గొప్పదేవాలయానికి 2 కి.మీ. దూరంలో శ్రీకృష్ణుడి పత్ని అయిన రుక్మిణీ దేవికి ఒక ఆలయంఉన్నది. దానికి పక్కన నాగేశ్వర మహదేవ తీర్థం అనే మరొక పురాతనమైన శివాలయం ఉన్నది. దానికి సమీపంలో పవిత్రమైన ఒక తటాకం ఉన్నది. శ్రీకృష్ణుడి బాల క్రీడలలో పాలుపంచుకున్న బృందావన గోపికలు శ్రీకృష్ణుణ్ణి చూడడానికి ద్వారకకు వచ్చినప్పుడు ఇక్కడే విడిది చేశారని చెబుతారు.

అతి ప్రాచీనమైన ద్వారకానగర చరిత్ర-శ్రీకృష్ణుడితో ప్రారంభించి, ఆదిశంకరులు, మీరాబాయి వరకు విస్తరించి ఉన్నది.

నగర శివార్లలో కొన్ని ఆధునిక పరిశ్రమలు నెలకొల్పబడినప్పటికీ, ఇంకా ప్రాచీన ప్రశాంతత కొనసాగుతున్న అతి కొద్ది నగరాలలో ద్వారక ఒకటి అని చెప్పవచ్చు. ఆధునిక జీవన విధానానికి అవసరమైన అన్ని సదుపాయాలూ ఇక్కడ ఉన్నాయి. అయినా, నగర వాతావరణంలో గతవైభవ ఛాయలదే పైచేయిగా కనిపిస్తున్నది!








# అమెరికా అధ్యక్షుడి భారత్ పర్యటన



పునఃపరిశీలన పునరాలోచన అనంతరం మైత్రీసహకార ఒప్పందంలో సంతకాలు జరిగాయి

అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ గత మార్చి నెలలో భారత్‌లో పర్యటించిన విషయం చరిత్రలో భాగమై పోయింది. ఆయన మన దేశానికి రావడానికి కొన్ని నెలలముందునుంచే అసాధారణమైన ప్రచారం జరిగింది. క్లింటన్ రాకకు సంబంధించిన ఏదో ఒక అంశం గురించి పత్రికలు రోజూ ప్రస్తావిస్తూ వచ్చాయి. ఆయనరాకను గురించి రాజకీయ పార్టీనాయకు లందరూ తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు.

అమెరికా అధ్యక్షుడి భారత్ పర్యటన అలాంటి అపూర్వ ప్రాముఖ్యతను సంతరించుకుని అందరి దృష్టినీ ఆకర్షించడానికి కారణం ఏమిటి? ఈనాడు అమెరికా అతి శక్తివంతమైన రాజ్యంగా ఉండడమా? అవును. అది ఒకకారణం. దీనికి మించినమరొక కారణం కూడా ఉన్నది. అదేమిటంటే - ప్రజాస్వామ్య విలువలను పరిరక్షించాలని అమెరికా ఘోషిస్తూ ఉంటుంది. అటువంటి దేశానికి అధ్యక్షుడు - ప్రపంచంలోకెల్లా పెద్ద ప్రజాస్వామ్య దేశమయిన మన దేశానికి రావడం!

1947వ సంవత్సరంలో భారత్ విభజన జరిగి, పాకిస్తాన్ ఏర్పడింది. అయితే పాకిస్తాన్‌ను

ఎక్కువకాలం నియంతలే పాలిస్తూ వచ్చారు. పాకిస్తాన్ సమైక్యతను కాపాడుకోలేకపోయింది. తీవ్ర రక్తపాతం తరవాత తూర్పు పాకిస్తాన్ బంగ్లాదేశ్‌గా విడిపోయింది. పాకిస్తాన్ ప్రజలకు ప్రజాస్వామ్యం ఒక కలగానే మిగిలిపోయింది. ఇప్పుడు కూడా అదొక సైనికాధికారి పాలనలోనే ఉంటున్నది. ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నుకోబడిన ప్రధానమంత్రి ఖైదీగా కాలం గుడుపుతున్నాడు. అయినప్పటికీ అమెరికా అధ్యక్షుడు పాకిస్తాన్‌లో కొన్ని గంటలు గడిపాడు. క్లింటన్ పాకిస్తాన్‌కు వెళ్ళి వుండకూడదు. ఆయన పాకిస్తాన్ వెళ్ళడం అక్కడి సైనికాధికారిని ప్రోత్సహించినట్టే అయింది, అని కొందరు అభిప్రాయపడుతున్నారు. భారత్‌లో ఐదు రోజులు గడిపిన క్లింటన్ పాకిస్తాన్‌లో కొన్నిగంటలు మాత్రమే గడపడాన్ని గమనించినట్టయితే అది కేవలం మర్యాద నిమిత్తం జరిగిన తంతు మాత్రమే అని గ్రహించవచ్చు అని మరికొందరు పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు.



ఆయన
విచ్చేశారు,
చూశారు,
ఆకట్టుకున్నారు.

ఏది ఏమైనా, ప్రస్తుత పరిస్థితులు వెనకటికన్నా భిన్నమైనవి. కొన్నేళ్ళ వరకు అమెరికాకు ధీటుగా సోవియట్ యూనియన్ అగ్రరాజ్యంగా ఉండేది. భారతదేశం సోవియట్ యూనియన్‌తో సన్నిహిత మైత్రీ సంబంధాలు కలిగి ఉండడం వల్ల - పాకిస్తాన్‌తో మచ్చిక చేసుకోవడం అవసరం అని అమెరికా భావించింది. ఇప్పుడు ఆ పోటీ లేదు. పాకిస్తాన్ పట్ల అభిమానం చూపుతున్నట్టు కనిపించవలసిన అవసరం అమెరికాకు లేదు. పైగా అతి పెద్ద దేశంలో సంక్లిష్టమైన ప్రజాస్వామ్య విధానాన్ని పరిరక్షించుకుంటూ ముందుకు సాగుతూన్న భారత్ శక్తిసామర్థ్యాలను అభినందిస్తున్న అమెరికా ప్రజలు చాలామంది ఉన్నారు. మునుముందు గొప్ప శక్తివంతమైన దేశంగా పరిణమించడానికి అవసరమైన వనరులు, శక్తి సామర్థ్యాలు భారతదేశానికి ఉన్నాయని వారు భావిస్తున్నారు. ఉభయ దేశాల మధ్య మైత్రీ సహకారసంబంధాలు మరింత పటిష్ఠమై స్థిరపడాలని కాంక్షిస్తున్నారు.

మన దేశంలో అమెరికా అధ్యక్షుడికి లభించిన సాదర స్వాగతం గురించి మనకందరికీ తెలిసిందే. ఉభయదేశాల నేతల మధ్య కొన్ని ఒప్పందాలలో సంతకాలు కూడా జరిగాయి. అవి కార్యరూపం దాల్చిన తరవాతే, క్లింటన్ భారత్ పర్యటన ఎలాంటి ఫలితాలను ఇవ్వగలదో స్పష్టంగా తెలుస్తుంది.

క్లింటన్ మనదేశ పర్యటనలో ఉన్నప్పుడే పాకిస్తాన్ ప్రోత్సాహంతో కొందరు తీవ్రవాదులు కాశ్మీరులో ముప్పై అయిదు మంది శిక్కులను హతమార్చి తమ రాక్షసప్రవృత్తిని చాటుకున్నారు. భారత్ అనుసరిస్తున్న నిర్మాణాత్మక మార్గాన్నీ, పాకిస్తాన్ ప్రదర్శిస్తున్న హింసాత్మక ఉన్మాద వైఖరినీ అమెరికా స్పష్టంగా గ్రహించడం ఎంతైనా అవసరం!

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ
వడపళని
చెన్నయ్-600 026





వ్యాఖ్యలను పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూలై 2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

## అభినందనలు



మార్చ్ 2000 నెల సంచికలో
బహుమతి పొందిన వ్యాఖ్యలు
పంపినవారు:
భమిడి ప్రసాద్, అలహాబాద్ బ్యాంక్
డా॥ఎ.బి.రోడ్, వోర్లీ, ముంబాయి:400025



బహుమతి పొందిన వ్యాఖ్యలు:
మొదటి ఫోటో : కుదిరింది జత!
రెండవ ఫోటో : చెదరని ఏకాగ్రత!!

# మీకు కనిపించిన ప్రతి రస్నా ప్యాక్‌ను కత్తిరించండి !!

## Rasna Pranky Gear Contest

## WIN 5,000 PRIZES!!




ప్రతి 32 గ్లాసు రస్నా ప్యాక్‌తో మీరు పొందగలరు 1 ప్రాంకీ ఉచితంగా ! అయితే, మీరు గెలువగలరు 5,000 బహుమతులు కూడా .

**బహుమతులు :** మొదటి 5,000 సరిఅయిన ఎంట్రీలు పొందగలవు పూర్తి ప్రాంకీ గేర్. (1 ప్రాంకీ వెస్ట్, 1 ప్రాంకీ కేప్, 1 ప్రాంకీ ఎడ్వెంచర్ బెల్ట్)

**సూచనలు :** మీరు చేయవలసినదల్లా- రస్నా ప్యాక్ వెనకవైపున్న ప్రాంకీ చిత్రాలను కత్తి రించండి. 10 వివిధరకాల ప్రాంకీ చిత్రాలను సేకరించండి. ఆతర్వాత కూపన్‌తో సహా పోస్ట్‌లో పంపండి.

**త్వరపడండి :** గుర్తుంచుకోండి, మొదటి 5,000 సరిఅయిన ఎంట్రీలు మాత్రమే ప్రాంకీ గేర్ పొందగలవు. ఒకదాన్ని పొందడానికి మీ గ్యాంగ్‌లో మీరే ముందుండండి. ఇక త్వరపడండి! మీకు కనిపించిన ప్రతి రస్నా ప్యాక్ కత్తిరించడం మొదలుపెట్టండి.




I amsending my collection of 10 different Pranky cutouts. Please send my Pranky Gear to:

Name:................................Age:............

Address:..............................................

..........................................................

..............................Pin:........................

State:..............................Tel:........................

Mail to: **Marketing Unlimited!**
E/ 904, Sarjan Tower, Nr. Sunvilla Row House,
Gurukul Road, Ahmedabad - 380 052.

For more Pranky Fun visit : www.gogokid.com

Mudra:RASNA:99/478 FP Tel